# మెహెర్ కథా మంజరి



జి.వి.జి.కె. చంద్రమౌళీశ్వర రావు



# మెహెర్ కథా మంజరి

( మెహెర్ అవతార ప్రాశస్త్యం)
మొదటి భాగం

సంకలనం

వి.జి.కె. చంద్రమౌళీశ్వర రావు

అవతార్ మెహెర్ బాబా మచిలీపట్నం సెంటరు
మచిలీపట్నం

2

# MEHER KATHA MANJARI

Compiled By

G. V. G. K. CHANDRA MOULESWARA RAO

వెల రూ. 8-00

అవతార్ మెహెర్ బాబా మచిలీపట్నం సెంటరు
ప్రచురణ

ప్రథమ ముద్రణ :
1981 నవంబరు ఒకటి

ప్రతులు 1000

ముద్రణ :
డీసెంట్ గంగా ప్రెస్
విజయవాడ-2

ప్రతులకు :
జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు
29-36-12, మ్యూజియం రోడ్
విజయవాడ - 520002

అవతార్ మెహెర్ బాబా మచిలీపట్నం సెంటరు
పోర్టురోడ్, మచిలీపట్నం-52 001

3

# తొలి పలుకు

"యదా యదాహి ధర్మస్య
గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య
తదాత్మానం సృజామ్యహం!"

ధర్మము క్షీణించి అధర్మము ప్రబలినప్పుడు భగవంతుడు అవతరించునని భగవద్గీతలోని పై శ్లోక తాత్పర్యం. సర్వ జగత్తు భగవంతునిచే సృష్టించబడి, ఆయనచేతనే రక్షించబడుచున్నది. సర్వమూ భగవంతునిస్వరూపముగా తెలుసుకొనుటకే ఈ మాయాప్రపంచ నిర్మాణము. మనలను మన గమ్యం చేర్చుటకే భగవంతుడు పదేపదే మానవరూపంలో అవతరించును. స్వార్థపరత్వం, ఈర్ష్య మానవాళిలో పెరిగి కేవలం శరీరమే తామని భ్రమపడి అహంకారమునకు అంతులేక పరిశుద్ధ ప్రేమ శూన్యమైనప్పుడు, ప్రియతముడగు భగవంతుడు తన పరబ్రహ్మ పరమాత్మ స్థితినుండి సామాన్య మానవుడుగా అవతరించును.

తన అవతారకాలంలో ఆధ్యాత్మిక పురోభివృద్ధి కలిగించుటతోపాటు ఆత్మజ్ఞానాన్ని ప్రబోధించును. ఏ కొద్దిమందిచేతనో తప్ప, మానవాళిచే గుర్తింపబడడు. ఎన్నో బాధలు, అవమానములకు గురియైనప్పటికీ, అవతారుడు ప్రతి యుగములోను సర్వమానవ సౌభ్రాతృత్వం మనకు వలయు ప్రేమమార్గమును అందరి హృదయాలలో, మనస్సులలో నెలకొల్పి స్వార్థంతో ఎవరికి వారు తాము వేరనే ధోరణి పటాపంచలుచేసి, తిరిగి అవతరించు కాలమువరకు వలయు కార్యము సమకూర్చును. ఈ సత్యాన్నే రచయిత ఈ చిన్న పుస్తకంలో అందించారు.

"మెహెర్ కథామంజరి" గ్రంథంలో రచయిత, మెహెర్ అవతార ప్రాశస్త్యము గురించి చక్కగా వివరించారు. మోడువారిన వృక్షాలు సైతం వసంతంలో చిగిర్చి, ఫలాపుష్పమై అలరారునట్లు, మెహెర్ బాబా తన అవతార కాలంలో మానవాళిమధ్య ప్రేమను చిగురింపచేసి అడుగంటిన దివ్యజీవితమును ఏ విధంగా పునరుద్ధరించారో, సంస్కార బంధములనుండి విముక్తి కలిగించుటకు చక్కని మార్గములు ఎలా చూపారో, జనన మరణ చక్రములనుండి తన ప్రేమాశీస్సులతో ఎలా తప్పించునో మున్నగు విషయముల గురించి రచయిత అందరికీ అర్థమగు

నట్లు హృదయ పరివర్తనకు దోహదపడునట్లు కడు రమణీయంగా పొందు పరిచారు.

బాబా చిన్ననాటినుండి వ్యక్తిగత జీవనం, సామాన్య మానవుడుగా సద్గురువుగా, పంచ సద్గురువులచే అవతారుడుగా గుర్తింపబడుట, అవతారుడుగా ఖండాంతర ప్రయాణములుజేసి ఏ విధంగా మానవాళిని తరింపజేసినదీ, కారు ప్రమాదాలనే మిధ్యలో అమిత బాధలకు లోనై, వారి నెత్తురు చిమ్ముటద్వారా ఆయా దేశములకు వ్యపదశ్రీవములను తొలగించి భవిష్యత్తును మెరుగుపరచుట గురించీ, యీ సంకలనంలో మనోజ్ఞంగా వర్ణించబడినది.

రచయిత ముఖ్యంగా సృష్టి రహస్యం, దాని పుట్టుక, గమ్యంగురించి వివరించిన "గాడ్ స్పీక్స్" గ్రంథమందలి విశేషాలు, కని విని ఎరుగని మౌనాన్ని పాటించి తద్వారా శాంతిని పరిరక్షించుట గురించి. మస్తుల కార్యక్రమంద్వారా వున్నత భూమికలో నిలిచిపోయినవారిని గమ్యము చేర్చుట, కుష్టురోగులు, వికలాంగులకు పాదప్రక్షాళన, ధన వస్త్ర సహాయంచేసి వారిలోని దైవాన్ని ప్రపంచం గుర్తించునట్లు చేయుట గురించి కళ్ళకు కట్టినట్లు సహేతుకంగా వివరిచారు.

"నవజీవనము" ద్వారా మండలివారు సభ్యులను పనిముట్లుగా వుపయోగించుకొని సర్వమానవాళికి ఆచరణపూర్వక అనుభూతిని ఏ విధంగా కలిగించారో చక్కగా తెలియజేశారు. బాబా జీవితకాలంలో వారి మెహెరాబాద్ ఆశ్రమంలో పూనాలోని గురుప్రసాదు బంగళాలో జరిపిన సహవాస కార్యక్రమాలలో ప్రేమావతారుడుగా అందించిన ఎనలేని దివ్య సందేశాలు, మెహెరాబాద్‌లోని అంతరంగిక మండలితో నివాసము, వారి నిర్యాణానంతరం మెహెరాబాద్ కొండపై నెలకొల్పబడిన బాబా సమాధి ప్రాముఖ్యత వేయేల మనం తెలుసుకోలేని, మనకు సులభంగా అర్థంకాని బాబా కార్యక్రమ నిర్వహణ విధానం తేటతెల్లముగా, అతి సులభశైలిలో పిల్లలకు, పెద్దలకు చదివినంతనే మానసోల్లాసము కలుగునట్లు ఆధ్యాత్మిక ఔన్నత్యము, ఎట్టి వ్యయ ప్రయాసలులేకుండా పొందగలుగునట్లు రచయిత తన సంకలనాన్ని తీర్చిదిద్దారు.

అవతారుని దర్శనభాగ్యం పొందనివారు, ఆయన సాహవాస కార్యక్రమములలో పాల్గొననివారు, వారిని ఇంతవరకూ అవతారునిగా తెలుసుకొనలేనివారు ఒక్కరననేమి? ప్రతివారు ఒక్కసారి ప్రశాంతంగా మంచి మనస్సుతో చదివిన యెడల, దివ్యానుభూతిని పొంది ప్రేమమూర్తులు కాగలరని నా అభిప్రాయం.

గ్రంథకర్త చంద్రమౌళీశ్వరరావు ప్రియతమ బాబా భక్తుడు. అవతారుని కార్యక్రమాలలో సర్వార్పణ గావించుకున్న వజ్రసంకల్పుడు. నిరాడంబరమైన వినయశీలి. నిస్వార్థుడు. అహంకార రహితుడు. కష్టములను దైవప్రసాదములుగా ఆనందంతో స్వీకరించు నిరాడంబరుడు. భగవత్ గీతాసారాన్ని నిజజీవితంలో, ప్రవర్తనలో, విధి నిర్వహణలో తూచా తప్పనివాడు. ఆర్థిక బాధలు, తన జీవనోపాధికిగానీ, దివ్యానుభూతికిగానీ, ప్రేమ మార్గమునకుగానీ, ఎట్టి అవరోధములు కావని ఆయన దృఢవిశ్వాసము. కడు శాంతమూర్తి. ఆంతరంగికముగా తెలిసినవ్వారు మాత్రమే, వీరిని గుర్తించి అర్థంచేసుకొనగలరు.

ఇట్టి సౌజన్యమూర్తి సంకలనం చేసిన "మెహెర్ కథామంజరి" గ్రంథాన్ని మచిలీపట్నం సెంటరుద్వారా ప్రచురించు భాగ్యం దొరుకుట బాబా కృపగా భావిస్తున్నాను. బాబా ప్రేరణచే సోదరుడు చంద్రమౌళీశ్వరరావు సేవలు, మా సెంటరుకు దొరికినందుకు మా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. అమృతోపమానమగు బాబా దివ్యవాణిని తన మృదు మధురవాక్కులతో బాబా ప్రేమికలోకానికి అందించుటకు ఇటువంటి గ్రంథానేకము ముందుముందు వెలువరించగలందులకు తగు శక్తిని ప్రసాదించమని "బాబావారి ప్రేమాశీస్సులు కలకాలం వీరిపై వర్షించుగాక!" అని అవతార్ మెహెర్‌బాబావారిని వినయంతో ప్రార్థిస్తున్నాను.

జై బాబా!

మచిలీపట్నం
1-11-81

తాడేపల్లి బసవయ్య
సెక్రటరీ
అవతార్ మెహెర్‌బాబా మచిలీపట్నం సెంటర్

# నా మాట

జై బాబా!

క్షణ భంగురములగు భౌతిక సుఖములుకోరి, భగవంతుని ఆరాధి స్తే అది దైవారాధన కాబోదు. మరి అట్టి భగవంతుడే మానవుడై అవతారు నిగా అవతరించినప్పుడు మనం వీటన్నిటినీ త్యజించి, సర్వార్పణ గావించు కోగలిగితే తప్పక ఆయన అనుగ్రహం పొందగలం.

అది బాబా ప్రేరణో, లేక నా పూర్వజన్మ పుణ్యఫలమో, 1968 సం॥ నా జీవితంలో ఒక క్రొత్త మలుపుకు నాంది పలికింది. 1954 లో బాబా ఆంధ్రదేశ పర్యటనకు వచ్చినప్పుడు ఆ దివ్యమంగళ స్వరూపాన్ని దర్శించే మహద్భాగ్యం నాకు అప్పటిలో దొరికినా, బాబా సేవా కార్య క్రమంలో కార్యకర్తగా ఆయన పావన చరణారవిందముల సన్నిధిని వినమ్రతతో కైమోడ్చు అవకాశం నాకు 1968లోనే ప్రాప్తించింది.

అదియునుగాక ఆ సంవత్సరంలోనే మేము నూజివీడులో నిర్మించ దలచిన యింటి విషయంలో నా అభ్యర్ధనమేరకు "నీవు వెంటనే ఆ స్థలంలో నా పేర యింటిని నిర్మించి నా కార్యక్రమాలను విడువక సాగిం చుము. నీకు నా ఆశీర్వచనములు" అంటూ బాబా తంతిద్వారా ఆజ్ఞాపించి నన్ను తన పరిధిలోకి లాగారు.

ఆ పిమ్మట సో॥ ఆది. కె. ఇరానీ స్వయంగా నూజివీడు విచ్చేసి, మా యింటికి శంకుస్థాపన చేసి "మెహెర్ నిలయం" అని నామకరణం చేశారు. ఆ సంవత్సరంలోనే పూజనీయులైన నా తండ్రిగారి మర ణంతో విచారంలోవున్న నన్నునుగ్రహిస్తూ బాబా "నీకు నా యందున్న ప్రేమ, నీ తండ్రికిహ జన్మ లేకుండా శాశ్వతంగా నా యందైక్యం చేసి నది" అని తంతి పంపారు.

మరి 1968 లోనే బహుశః, అవతారుని ప్రేరణే కావచ్చు—— దీ23-9-68నుండి 1-10-68 వరకు బాబావారి నవరాత్రి మహోత్సవములు, ఏకాహం అతివైభవంగా జరుపబడినవి. శ్రీయుతులు రాజా యం. ఆర్. అప్పారావు, యం. అప్పలనాయుడు, స్వామి సత్యప్రకాశ్ ఉదాశీన్, ఎన్. ధర్మారావు నాయుడు మున్నగు ప్రముఖ బాబా ప్రేమికులు యీ తొమ్మిదిరోజులు ఆయన దివ్యవాణిని వినిపించారు. ఆ తొమ్మిది రోజులూ ఆయన తన ఆశీసులను రోజుకో తంతిగా పంపారు.

నూజివీడు పరిసరాలలో బాబా సందేశాల్ని వ్యాప్తిచేసే భాగ్యం నాకు 1973వరకు కలుగుటకు స్వా॥పెమ్మరాజు సుందరశివరావు ముఖ్యకారకుడు. ఆటుతర్వాత విజయవాడలో స్వా॥వై. మాణిక్యాలరావు సహకారంతో దాదాపు ఏడేళ్ళపాటు బాబా లీలావిశేషాల్ని పదిమందికీ అందించే అవకాశం దొరికింది.

ప్రస్తుతం మచిలీపట్నం, చల్లపల్లి సెంటరులలో శ్రీ తాడేపల్లి బసవయ్య దంపతులు, యిమ్మిడి మధుసూదనరావు, పింగళి దుర్గాప్రసాదు యిత్యాది బాబా ప్రేమికుల సాంగత్యంలో మెహెర్ అవతార ప్రాశస్త్యాన్ని "మెహెర్ కథామంజరి" రూపంలో బాబా ప్రేమికులకందివ్వాలనే సంకల్పం కలిగి ఈ చిన్ని పుస్తకాన్ని సంకలనం చేశాను. అందరికీ అందుబాటులో వుండే రీతిలో, సులభశైలిలో బాబా జీవితంలో సంఘటనలతో అన్వయిస్తూ యీ సంకలనాన్ని తయారుచేశాను.

యిందులోని అంగాలన్నీ యింతకుముందు ఆంగ్లభాషలో ప్రచురించబడినవేకాని, నా కల్పితములు మాత్రం కావు. ఆయా గ్రంథకర్తలకు నా కృతజ్ఞతాభివందనములు తెలుపుకుంటున్నాను. ఈ పుస్తకంలో చాలాచోట్ల బాబా చెప్పినట్లు వివరించబడినది. అందే, అట్టి సందేశాన్ని బాబా మౌనంగానే సౌజ్ఞలతో అందించినట్లు గ్రహించగలరు. ఈ మొదటి భాగమంతా బాబా జీవితంలో ప్రవచనాత్మకంగా ముడివేసుకున్నది. త్వరలో వెలువడే రెండవభాగం బాబా మానవాళిని మేల్కొలిపిన సంఘటనలతో నిండియున్నది.

నా యీ తొలియత్నంలో కించిత్తు లోపములున్నా మన్నించి, సహృదయులయిన పాఠకులు మెహెర్ దేవుని ప్రేమలో ఆధ్యాత్మికానుభూతిని పొంది, యుగావతారుని ప్రేమాశీస్సుల నందుకోగలరని నా ఆశ.

అవతార్ మెహెర్ బాబాకి జై !

ఇట్లు

జి. వి. జి. కె. చంద్రమౌళీశ్వరరావు

మచిలీపట్నం
1-11-81

జై బాబా

మెహెర్
కథామంజరి

ఈ సర్వ జగత్తు భగవంతునినుండి వెలువడినది. అంతేకాని భగవంతుడు జగత్తునుండి రాలేదు. యదార్థమునుండి మిధ్య (మాయ) వెలువడినది. భగవంతుడు మాత్రమే సత్యం. యీ జగత్తంతయూ మిధ్య

భగవతుడు సర్వ స్వతంత్రుడు. మరియూ సర్వ జగత్తు పూర్తిగా భగవంతునిపై ఆధారపడియుండును. భగవంతునికి, జగత్తుకు మధ్య వారధి అనంతదయ మరియు అవధులులేని అపారప్రేమ. ఈరెండింటినీ వుపయోగించుకుని, మానవుడు, తానే దైవము (కుతుబ్ లేక సద్గురువు) అగుచున్నాడు. దైవము మానవుడై అవతారుడుగా భాసిల్లుతున్నాడు. అందుచేత యీ జగత్తు భగవంతునికి శాశ్వతఆటస్థలమగుచున్నది.

అతి ప్రధానమైన యీ అనుబంధంద్వారా భగవంతుడు అవతారుడుగా అవతరించి తన దైవక్రీడలో ఒక జీవితం స్థాపించుటయే గాక, మిధ్యలో ఒక చట్టాన్నికూడా నియమిస్తున్నాడు. అవతారునిచే నియమింపబడిన యీ చట్టం, చట్టవిహితమై అనంతము శాశ్వతము అయిన "సత్యము" నకే చట్టమగుచున్నది. అదే సమయంలో అది మిధ్య అగు

చున్నది. యీ చట్టమే యీ జగత్తునంతయు పరిపాలించును. ఒడుదుడుకులు, ఎత్తుపల్లాలు, నిర్మాణాలు, విర్మూలనలు సమస్తమూ యీ చట్టమువలన పరిపాలించబడును.

ఈ భూమిపై భగవంతుడు మానవరూపధారియై అవతరించి, ఆయన దైవత్వమును మానవాళికి తెలియపరచినప్పుడు, ఆయన అవతారుడుగా గుర్తించబడును. అనంతుడగు భగవంతుడు యుగయుగాలుగా, యీ కాల చక్రంలో మానవాళిమధ్య మానవస్థాయికి దిగివచ్చి, మానవుడగుచున్నాడు.

అయితే మానవాళిమధ్య తన భౌతిక వునికికి, భంగం కలుగనీయక, మానవదృష్టిలో ఒక సామాన్య వ్యక్తిగా కనబడును. అయితే యుగావతారుడుగా తన అద్వితీయ దైవత్వమును అవతారుడుగా ప్రకటించినప్పుడు కొందరాయనను భగవంతునిగా అంగీకరించి ఆరాధింతురు. ఆయన ఘన వైభవమును శ్లాఘింతురు. భౌతికంగా మానవులమధ్య సంచరించు నప్పుడు, తక్కినవారాయనను గుర్తించక తిరస్కరించెదరు. యీ విధముగా, ఆ దైవమే మానవుడై తనకు తానుగా, తానే భగవంతుడనని ప్రకటించుకొని, అనంతమైన ప్రేమతో, ఏ మానవాళి సముద్ధరణకై తానవతరించునో, అట్టి మానవులచేతనే తిరస్కరించబడి, అవహేళన చేయబడి, బాధింపబడి, తనకు తానే బాధలను తెచ్చుకొనును. మానవాళిమాత్రం. ఆయనను కీర్తించి, అవమానించి ఏదో విధంగా, ప్రతి ఒక్కరూ ఆ భగవంతునియొక్క అనంతమగు శాశ్వత వునికిని ధృవీకరించుచున్నారు.

అవతారుడు అన్ని యుగాలలోను ఒక్కడే. వేర్వేరు యుగము లందు, భిన్న ప్రాంతములలో, విభిన్న రూపములలో శాశ్వత సత్యాన్ని బహిర్గతపరచుటకు, అనంతుడగు భగవంతుడు సనాతన పురుషుడుగా అవతరించును. వేర్వేరు వేషధారణలతో, వివిధ భాషలలో తన అవతార తత్వాన్ని ప్రకటించును. మానవాళి సముద్ధరణకు. అజ్ఞానాంధకారము

నుండి పైకి లాగుటకు, భ్రాంతి జనక బంధములనుండి విముక్తులను కావించుటకు అట్టి అవతారము సహాయపడును.

దైవమంటే బ్రహ్మానంద స్వరూపము. రూప రహితమైన, పేరు లేని ఆత్మయొక్క సర్వోన్నత శక్తియే దైవమనబడును. ఆ దైవము ప్రేమ, దయకు ప్రతిరూపము. యీ మానవ జీవితముయొక్క ధ్యేయము అట్టి దైవమునారాధించుట. మన గమ్యం అట్టి దైవ సాక్షాత్కారము పొందుట. మరి అట్టి దైవమునారాధించు శక్తి, దైవ సాక్షాత్కారము పొందగల అర్హతలను ఆ దైవముయొక్క కృపవలననే లభ్యమగును. అట్టి కృప ప్రసరించబడినపుడు భగవంతుని గాఢంగా ప్రేమించి, ఆ ప్రేమ ద్వారా తన గమ్యం చేరగలుగుచున్నాడు.

ప్రతి యుగంలోను ఎప్పుడూ 7000మంది ఆధ్యాత్మిక వారసత్వంలో ప్రముఖ సభ్యులుగా వివిధ భూమికలతో వుందురు. వీరిలో 56 మంది దైవ సాక్షాత్కారము పొందిన ఆత్మలు, తురీయావస్థలో చేరి, పరిపూర్ణ గురువులుగా మానవరూపంలో వుందురు. ఈ ఏబది ఆరుమందిలో ఎనిమిది మంది మాత్రము బహిరంగంగా అందరి గుర్తింపు పొందివుందురు. ఆ ఎనిమిదిమందిలో కూడా ఐదుగురుమాత్రం సద్గురువు (పర్ఫెక్టు మాస్టర్స్) తక్కిన ముగ్గురు మజూబ్లు. సకల చరాచర సృష్టికి మూల కారణమైన, అనంతశక్తి జ్ఞానానంద స్వరూపుడైన భగవంతుని యొక్క ప్రభావము ఈ అయిదుగురు సద్గురువుల ఆధ్యాతిక శక్తిద్వారా ఈ విశ్వ మంతటిని పరిపాలింపచేయును. ధర్మచ్యుతి కలిగి, అధర్మము ప్రబలి నప్పుడు, మానవాళినుద్ధరింప, సాక్షాత్తు ఆ భగవంతుడు, తన సృష్టిలోని జీవరాసులపై తనకున్న అనంతప్రేమ, అపారదయల మూలమున ఈ పృథివిపై మానవరూపంలో అవతరించినపుడు, ఈ పంచ సద్గురువులు తమకు ఒప్పగించబడిన అధికారమును తిరిగి ఆ భగవదవతారమునకే ఒప్ప చెప్పి, అవతారుడు తన విశ్వ కార్యక్రమమును ముగించి, అవతార సమాప్తము చేసినతరువాత తిరిగి అధికారము చేపట్టెదరు.

దేశ కాల పరిస్థితులననుసరించి, ఈ విశాల జగత్తులో, ఆయాకాలము లందు, అవతార పురుషుడుగా, భగవంతుడు, భిన్న రూపములతో, భిన్న, భిన్న నామములతో, ఆయా ప్రాంతములందు అవతరించుచుండును. అట్లు మానవ దేహధారియై అవతరించిన భగవంతుడు, తత్కాలానుసరణముగ ఒక బాహ్యరూప, నవీన మతస్థాపన చేయుటచేత, అవి భిన్నరూపములు కలిగివున్నప్పటికీ తాత్వికంగా అవి ఒకే ఆదర్శమునకు సంబంధించిన బోధలే ఆగుచున్నవి. ఈశ్వరానుభవము, బ్రహ్మానుభవము, యుగవద్ధర్మములు, కలిగినవానిని, అవతార పురుషుడు అందురు. అవతారుడు ప్రభుధర్మము, సేవకాధర్మము, ఒకే కాలమున ప్రకటింపగల సిద్ధపురుషుడు. ఈ మానవ కోటిని, మృత్యురూప సంసారంనుండి తరింపచేయుటకు, బ్రహ్మవ స్థానమునుండి, మానవావస్థానమునకు అవతరించి వచ్చిన షడ్గుణైశ్వర్య సంపన్నుని అవతారుడు, లేక భగవంతుడు అందురు.

హజరత్ బాబా జాన్. షిర్డీ సాయిబాబా, ఉపాశినీ మహారాజు, తాజుద్దీన్ బాబా, నారాయణ మహారాజు అను అయిదుగురు సద్గురువులచే ఈ యుగమందవతరింప చేయబడిన అవతార పురుషుడే "అవతార్ మెహెర్ బాబ". "మెహెర్ బాబ" అను శబ్దం మనకు అనుగ్రహశాలి యగు తండ్రి అని అర్ధము. శ్రీ బాబావారికి తలిదండ్రులు పెట్టిన పేరు మేర్వాన్ షెరియార్జీ యిరానీ. వీరి తండ్రి షెరియార్జీముండేగర్ యిరానీ. తల్లి షిరీన్‌మాయి. వీరు పారశీక వంశీయులు. జోరాష్ట్రియన్ మతస్థులు. తండ్రి ముండేగర్ యిరానీ తన ముప్పయ్యవ ఏటివరకు దైవాన్వేషణ చేస్తూ అధ్యాత్మిక బాటసారిగా గడిపి, తుదకు అశరీరవాణి వాక్కువలన, భగవంతుడు తన గర్భవాసమునందే జననమందనున్నాడని తెలుసుకున్న పుణ్యమూర్తి. శ్రీ షెరియార్జీ, షిరీన్‌మాయిలను పుణ్య దంపతుల ముద్దు బిడ్డగా, పూనా నగరమందలి ససూన్ హాస్పటల్‌లో 1894 ఫిబ్రవరి 25 వ తేదీ గురువారం ఉదయం ఐదుగంటలకు బాబా జననమందిరి. శ్రీ బాబాకు తలిదండ్రులు పెట్టిన పేరు మేర్వాన్ షెరియార్జీ యిరానీ. అయితే మేర్వాన్ అను నామము మెహెర్ అను పేరుతో సంక్షిప్తపరచబడినది.

షెరియార్జీ, షిరీన్‌మాయిల అష్ట సంతానంలో మేర్వాన్ రెండవ సంతానం. ఇతడు పుట్టుకతోనే చాలా ఆరోగ్యవంతుడైన అందమగు బాలుడు.

మేర్వాన్ బాల్యం : అలనాడు తల్లి యశోదకు శ్రీకృష్ణుడు ఎన్నెన్నో బాల వినోదములు చేసి చూపినటు, మేర్వాన్‌కూడా అద్వితీయ చర్యలు చేసి చూపించెను. కోడెత్రాచుతో ఆటలాడుట, స్వగృహ ప్రాంగణమందలి బావినుండి, దేవతా స్త్రీమూర్తి తల్లికి ప్రత్యక్షమై, మేర్వానును తనకు ఒప్పగించమని కోరుట, ప్రసవవేదనకు ముందు, తల్లి అపురూప సుందర దృశ్యములు అనేక ప్రజా సమూహములు గాంచుట మున్నగునవన్నీ అవతారుని ఆగమన సూచనలు. బాబా బాల్యంలో తన అవతార చిహ్నములు ఎలా చూపించారో ఒక సంఘటనలో చూడండి

బాబాబాల్యంలో రెండువసంతములు గడిచిపోయినవి. చిరుతప్రాయం బుడిబుడి అడుగులతో తలిదండ్రులను మురిపిస్తూ అటుయిటు తిరుగుట ఆరంభించెను. అట్టి ప్రాయంలో మేర్వాన్ తప్పటడుగులు వేస్తూ ఒకనాటి సాయంసమయాన యింటి ప్రాంగణంలో ఆడుకుంటూ మెల్లగా యింటి ముందున్న నడిరోడుపైకి చేరెను. యింటి పనులలో నిమగ్నమైయున్న తల్లి షిరీన్‌మాయి మేర్వానును గమనించలేదు. అంతలో ఆలమందలు, పాడి పశువులు పచ్చిక మేసి, అటుగా తమతమ యిళ్ళకు చేరుతూ వీరింటి వైపుగా రాసాగాయి. మేర్వాన్ వాటినుండి తప్పుకొనలేక గేదెలమధ్యలో చిక్కుపడిపోయెను. అంతలో యాదృచ్ఛికంగానే తల్లి షిరీన్‌మాయి మేడ పైనుండి ఈ భయంకర దృశ్యాన్ని చూసింది. జరగబోతున్న ఘోరాన్ని వూహించి అచేతన అయిపోయినది. ఒక్కుమ్మడిగా మేడపైనుండి పరుగున దిగి తనయుని రక్షించుకొనుటకు నడిరోడ్డుపైకి చేరుకున్నది. అప్పుడు ఆమె చూసిన దృశ్యము ఏమని వర్ణించను? పశువులన్నీ మందలుగా రోడ్డుపై పోతున్నవి. వాటిమధ్య పసివాడు మేర్వాన్ చిక్కుకున్నాడు అంతలో బలమైన మహిషమొకటి మేర్వాన్‌పైగా, తన ముంగాళ్ళను. బాలునిముందు వుండునట్లు, వెనుకకాళ్ళు వెనుకవైపున వుంచి సరిగా

బాలుడు తన పొట్టక్రింద మధ్యగా వుండునటు మేర్వానుకు రక్షణగా నిల బడి, తక్కిన మంద దాటిపోవవరకు అలాగే నిలబడిపోయినది. పశువు లన్నీ ఆవులు, గేదెలు, దూడలు అన్నీ దాటిపోయిన తరువాత ఆ మహి షము బాలకునికి ఏ విధమైన ప్రమాదము వత్తిడి తగలకుండా చల్లగా తప్పుకొని తనదారిన వెళ్ళిపోయెను. ఈ దృశ్యం చూసిన షిరీన్‌మాయి ఆనందంతో పరవశమై ఒక్కుమ్మడిగా కుమారుని అందుకుని అక్కున చేర్చుకుని, ముద్దులవర్షం కురిపించి, ఎట్టి ప్రమాదము జరగనందుకు వెయ్యిదేముళ్ళకు నమస్కరించెనట. పాపమూ మెకానాడు తన ఈ బిడ్డడే సాక్షాత్తు ఆ పరమాత్మ అని తెలియదు కదా! తన బాల్యంగురించి బాబా ఈ విధంగా చెప్పిరి. "నేను బాలకుడుగా వున్నప్పుడు నాకేమి తెలియదు. ఈ ఆధ్యాత్మికత గురించి నేనేమి చేయాలో కూడా ఎరుగను. డెర్విష్ యైన నా తండ్రి భగవదన్వేషిగా, ఆయన సాక్షాత్కారముకొరకు యావత్ పర్షియా, భారతదేశములు సంచరించెను. నాకాయన హాఫీజ్ తదితర కవుల గీతాలెన్నో నేర్పెను. అయితే నాకు వాటియందు ఎట్టి అభిరుచి కలుగ లేదు. నాకు ఆటలంటే యిష్టము. అందుచేతనే నేను ఆటలను ఎన్నుకుని తద్వారా యితరులకు నాయకుడుగా వుండెడివాడిని.

# దైవ క్రీడ

ఆటలలో బాబాకు పేకఆట, గోటిబిళ్ళఆట, క్రికెట్ మున్నగు భారతీయ ఆటలంటే మహాయిష్టం. ఒకసారి మండలితో పరివేష్టించి వున్నప్పుడు ఆటపాటలంటే తనకెంతో ఇష్టమని చెపుతూ బాబా యిలా చెప్పారు. "నేను గోళీలాటలందు, గాలిపటములు ఎగురవేయుటలోను. క్రికెట్ ఆట చూచుటలోను, పేకాటన్నా, గిల్లీ-దండ (కర్రా-బిళ్ళా)

ఆట అన్నా ఎంతో యిష్టపడెదను. అయితే నేను ఇలాంటి ఆటలాడుటకు రాలేదు. నేనీ శరీరముదాల్చి వచ్చినది మరో అవసరముకొరకు. నేను అపార దయాసముద్రుడను మరియు ప్రేమ సముద్రుడను. న్యాయ వ్యవస్థలో న్యాయపాలనకై న్యాయాధిపతులుండుట మనమెరుగుదుము. వారి విధి, తీర్పు తర్వాత తీర్పు చెపుతూ న్యాయమును చెప్పుట. ప్రాపంచిక న్యాయాధీసులు తీర్పు చెప్పినందున వారి తీర్పు ఫలితంగా కొందరు శిక్షింపబడుదురు, మరికొందరు విడుదలగుదురు. మరి నేను, విశ్వమయ న్యాయాధిపతిని. అందుచేత నేను తీర్పు చెప్పుదును. అయితే మీలో తప్పులున్నా లేకున్నా, మీరు దోషులయినా, నిర్దోషులయినా ఆ మేరకు నా తీర్పులో దోషులందురని క్షమించి వదలుదును"

బాబా ఎప్పుడూ తన విశ్వ కార్యక్రమము చేయుచున్నప్పటికీ, తన మండలితో అనేక రకపు ఆటలు ఆడుతూ మధ్య మధ్య వాటి వెనుక వున్న ఆధ్యాత్మిక విలువలను వివరిస్తుండెడివారు. ఆటలయొక్క సామాన్య సంభాషణలతో మెహెర్ బాబా శిష్యులకు ఏవిధంగా ఆధ్యాత్మిక అనుభవం కలిగించెడివారో కొన్ని వుదాహరణలు చూద్దాము. యీ వివరణ కేవలం కాలక్షేపంకొరకే కాక మనలో వుత్సాహం కలిగించేందుకు యిక్కడ పొందుపరచదగిన విలువగల విషయాలు.

1. ఒకరోజున బాబా మండలితో పేకాడుతున్నాడు. హఠాత్తుగా శిష్యులనుద్దేశించి "ఈ ఆటయొక్క అర్థం, ఆధ్యాత్మిక ప్రాముఖ్యము మీకు తెలుసునా?" అని ప్రశ్నించిరి. ఎవరినుండి జవాబు రాలేదు. బిక్క ముఖాలతో బాబావంక చూస్తున్నారు శిష్యులంతా. అంత యీ ఆటయొక్క ఆధ్యాత్మిక అర్థాన్ని బాబాయే ఈవిధంగా వివరించిరి.

"రెండునుండి పదివరకు వున్న పేకముక్కలు క్రిందిస్థాయి పరిణామ దశలకు ప్రతీకలు. ఆత్మ ఈ క్రింది దశలగుండా పాషాణదశనుండి, జంతుదశవరకు పయనిస్తూ మార్గంలో శక్తిని, అనుభవాన్ని సంపాదించుచు

జాకీముక్క మానవజన్మకు ప్రతిరూపం. అంటే పూర్తి చైతన్యం కలిగి భక్తికి ప్రధానదశగా భాశిల్లును. అంతరంగికపదముపై ఆత్మ చేసే ఆధ్యాత్మిక ప్రమాణంలో సహకారములగు కర్మయోగము, రాజయోగములకు ప్రతీక రాణిముక్క. జ్ఞానయోగమునకు ప్రతీక రాజుముక్క. వీటన్నిటికి అతీతమై, అధమదశలన్నింటినీ అధిగమించి నిలబడేది ఆసుముక్క. దీనికిదే సాటి. రెండవది దీనిని మించినది మరేదీ లేదు అని చెప్పేరు. "ఆసు" అనగా సత్యం, భగవంతుడు, పరమాత్మ ఆ ఏకైక శక్తి అని అన్వయించుకొనాలి" అని పేకాటలోని పేకముక్కలగ్గురించి చెప్పిరి.

2. కర్రి-బిళ్ళా ఆట. దీనినే గోటిబిళ్ళా ఆట అనికూడా అంటారు. యిది భారతీయ ఆట. రెండడుగ్గుల బారు కర్రి, రెండువైపుల కొసలుదేరి సన్నగా చెక్కబడిన చిన్న అరంగుళాల కర్రిబిళ్ళ (ముక్క) ఈ రెండింటితో ఆడే ఆటగురించి మెహెర్‌బాబా ఈ విధంగా వివరించిరి.

"ఈ ఆటలో చివరలు చిన్నగా చెక్కబడిన సన్న కర్రముక్కను నేలపైవుంచి రెండడుగుల పెద్దకర్రను చేతిలోవుంచుకుని దానిపై కొట్టి పైకి, గాలిలోనికి లేపాలి. అది కర్రితో కొట్టిన బలంవలన గిరగిరా తిరుగుతూ పైకి లేచును. అలా ఎగిరిన చిన్నముక్క భూమిపైకి తిరిగి పడేముందు చేతిలోని కర్రతో దానిని మరలా గట్టిగా కొట్టాలి. యిది అసలు ఆట విధానము. ఈ ఆట వెనుకవున్న ఆధ్యాత్మిక అర్థాన్ని బాబా ఈవిధంగా చెప్పారు. ఒక సద్గురువు దైవ సాక్షాత్కారము పొందగల అర్హతగల శిష్యుని ఎంపిక చేసుకున్నప్పుడు అట్టి శిష్యుని ప్రకృతి సహజమగు క్రిందిభాగాన్ని అంటే స్వీయ అహంకారాన్ని తప్పనిసరిగా గురి చూచి కొట్టును అలా స్వీయ అహంకారాన్ని కొట్టుట అంటే చిన్న ముక్కను పెద్దముక్కతో గాలిలో లేచునట్లు కొట్టుట అన్నమాట. శిష్యుని యొక్క అహంకారం ఒకసారి చెదరకొట్టబడినప్పుడు మరలా రెండవసారి కర్రబిళ్ళను గాలిలోనికి లేచిన తరువాత కొట్టినట్లు, అతడిని ఆత్మ సాక్షాత్కారమనే గమ్యం చేర్చుటకు రెండవదఫా మళ్ళీ గురువు స్వయం

చోదితీయము చేయాలి. యిలా గురు కృపచే గమ్యం చేర్చబడుట, గాలి లోనికి లేచిన చిన్నముక్కను తన శక్తినుపయోగించి ఎంతోదూరము పోవు వరకు కొట్టుటతో సరిపోల్చవచ్చును" అని చెప్పిరి.

మరి యిట్టి కృపను సాక్షాత్తు అవతారువినుండి పొందగలగాలంటే ఆయనను గాఢంగా ప్రేమించాలి. మన బాహ్యంగా ఎంత ప్రేమ ఒలక బోసినా అంతఃశుద్ధిలేని ప్రేమ నిష్ఫలమే అవుతుంది. బాబాకు నటన పనికి రాదు. నిష్కల్మష ప్రేమను ఆయన కాంక్షిస్తారు. అట్టి ప్రేమకు ఆయన దాసుడు.

ఆశ్చర్యమగు విశేషమేమంటే బాబా మానవులను, మనం మన చర్మ చక్షువులతో చూచినట్లు చూడరు. తమతమ గత అనేక జన్మల బంధాన్ని ఆయన తన విశాలదృష్టితో చూచెదరు.

మనము అసలు యిప్పటికి ఎన్నిజన్మలు ఎత్తివున్నాము, ఎటువంటి సంస్కారములు కలిగివున్నాము, ఏ కోవకు చెందివున్నామో ఆయన సర్వజ్ఞుడు కనుక యెరుగును. దీనినిబట్టి మనకు తెలియునదేమనగా, మన పూర్వజన్మ వాసనలనుండి వెలువడే కాంతిని ఆయన చూస్తారు. కానీ మనము ధరించే వేషభాషలకుకాని చేసే పని తీరుకుకానీ ఆయన ప్రాముఖ్యత యివ్వరు. మనలో ఎన్నో సద్గుణములుండవచ్చు, ఎన్నో దైవ కార్యములు నడుపుతూ దైవసేవ చేయవచ్చును. అయినంతమాత్రంతో మనమాయన దృష్టికి ఆకర్షితులము కాలేము.

బాబాను ఆకర్షించే ఏకైక వస్తువు ప్రేమ. ఒండొరుల మధ్య ప్రేమ, నిష్కల్మషప్రేమ ఆయన ఆశించేది. దీనిని గురించి విపులంగా వివరించమని బాబాను ప్రార్థిస్తే ఆయన ఏమాత్రం బాహ్యంగా చెప్పక పోయినప్పటికీ యూరుప్, అమెరికాలోవున్న బాబా ప్రేమికులకు ఒకచక్కని సంఘటనద్వారా యిలా వివరించెను.

ఉత్తరభారతంలో ఒక నిష్కళంక బాబా ప్రేమికుడొకరుండే

వాడు. ఆయన బాబా కార్యక్రమాలను తన వూళ్ళో నడుపుతూ వుండే వాడు. బాబా సాహిత్యాన్ని, ఫోటోలను పదిమందికీ పంచేవాడు. వూళ్ళో వారి అందరితోనూ బాబాగురించి చెబుతూవుండేవాడు.

ఆ వూళ్ళో బాబా కార్యక్రమాన్ని చాలా బాగా నడుపుతున్నాడు. బాబా దర్శన కార్యక్రమములు జరిగినప్పుడు ప్రతిసారీ వెళ్ళి దర్శనం చేసుకు వచ్చేవాడు.

దర్శనమునకు వెళ్ళే మన అందరి అనుభవమేమంటే, ప్రతివారి వంకా బాబా దృష్టి ప్రసరించి కన్నులతోనే అందరిని పలకరించేవారుకదా! అయితే పాపం యీ వ్యక్తి అనేకసార్లు వెళ్ళివున్నప్పటికీ ఒక్కసారి ఆయన యితడివంక చూడలేదు. అందుకతడు చింతించెను.

ఎలాగయినా బాబా తనవంక చూసే తనివితీరా చూసుకోవాలను కున్నాడు. మనకు తెలుసును, బాబా దర్శన సమయంలో ప్రేమికులు క్యూలో వరుసలుగా వెళ్ళి దర్శనం చేసుకుంటారు. ఒక్కొక్కరే బాబా పాదాలు స్పృశించి, అవకాశం వస్తే ఆలింగనం చేసుకొని వెళ్ళాలి. మనం యీ పనంతా త్వరగా చేసుకుని వెళ్ళాలి. లేకపోతే పదపదమని తోసి వేస్తారు సమీపంలో శిష్యులు.

మరి యీ వ్యక్తి యిలాంటి భావంతో, బాబా తనవేపు చూస్తూ వుండగా ఆయన స్పర్శభాగ్యం పొందాలనే వూహతో పాపం ఐదారుసార్లు దర్శనసమయాల్లో ప్రయత్నించెను. అయితే ఏ ఒక్కసారీ తానాశించిన ఫలితం పొందలేదు యితడివంతు వచ్చినప్పుడు ప్రతిసారీ బాబా ఎటో చూచేవారు. యితడినిమాత్రం చూసేవారుకాదు. సరిగా ఆదేసమయంలో మండలిలో ఎవరినో పిలిచేవారు. అలా అతడిని చూడక ప్రతిసారీ త్రోసి పుచ్చుతున్నారు.

చివరకు ఒక దర్శన కార్యక్రమంలో యీతడు యీరూచ్ దగ్గరకు వెళ్ళి ప్రతిసారి తనకు జరుగుతున్న అనుభవం, తన మనసులోవున్న

ఆకాంక్ష చెప్పి, ఈ మాటు ఎలాగయినా బాబా తనవైపు ప్రేమచూపులు ప్రసరించునట్లు చేయమని ప్రార్థించెను.

"నేనెంతగానో బాబా కార్యక్రమాలను మా వూళ్ళో ఘనంగా నిర్వర్తిస్తున్నాను. ఆయనను యెంతగానో ప్రేమిస్తున్నాను. ఆయన దర్శనం యిస్తున్న ప్రతిసారీ వచ్చి వెళుతున్నాను. అయితే ప్రతిసారి నేనాయన దగ్గరకు రావడం జరుగుతున్నదిగాని, ఆయనమాత్రం నన్నెప్పుడూ గమనించుటలేదు. నేనాయన కటాక్ష వీక్షణములు నాపై ప్రసరించాలని ప్రగాఢంగా కోరుకుంటున్నాను. కనుక దయచేసి మీరు ఆ ప్రయత్నం చేసి బాబా నావంక చూసేటట్లు చేయ" మని ప్రార్థేయపడెను.

అతడు చెప్పిన విషయమంతా విన్న యీరూచ్, అతనిలోవున్న విధేయతకు చలించిపోయెను. అతని ఆకాంక్షని గుర్తించి "అయితే సరే! రేపు ఉదయం జరిగే దర్శన సమయంలో నీవంతు రాబోయేముందు, నీ చేయి వూపి నాకు గుర్తుచేస్తే, నీవంతు రాగానే నేను బాబాయొక్క దృష్టి నీవైపు మరల్చెదను" అని హామీ యిచ్చెను.

ఈరూచ్ చెప్పినట్లే మర్నాడు ఆతడు వచ్చి దర్శనమప్పుడు వరుసలో నిలబడెను. యీరూచ్ చెప్పినట్లే తన చేయివూపి యీరూచ్‌కి తన కోరిక గుర్తుచేశాడు. అది గమనించిన యీరూచ్ బాబాను సంబోధించి "బాబా నేను నీకు ఒక విషయం...." అంటూ చెప్పబోయేసరికి. బాబా అది వినిపించుకొనక వేరేవైపు చూస్తూ యెవరితోనో మాటాడుతున్నారు. యీరూచ్ మాటలను ఏమాత్రం గమనించలేదు. అంతలో ఆ వ్యక్తి వంతు వచ్చి, బాబా దృష్టి తగలకుండానే జరిగిపోవలసి వచ్చినది.

బాబా దర్శనసమయం కాగానే అలవాటుగా బాబాను విశ్రాంతి కొరకు గదిలోకి తీసుకువెళ్ళిరి. "ఈరోజు అంతా బాగా జరిగిందా? ప్రేమికులంతా తృప్తి చెందారా? ప్రతిఒక్కరూ సంతృప్తులయినారా?" అని

ఆయన యీరూచ్‌ని అడిగారు. అందుకు యీరూచ్ "అంతా బాగా జరిగింది బాబా! కానీ ఒక్కడు మాత్రం తృప్తిపడలేదు" అన్నాడు.

ఒక పెద్దమనిషి, ఎప్పుడూ నీ కార్యక్రమాలు చేస్తూ నీ సేవ చేసుకుంటూ విన్ను రోజూ ప్రేమించే ప్రేమికుడొకరు యిప్పటికి అయిదార్లు సార్లు నీ దర్శనానికి వచ్చాడు. మరి అతడు వచ్చినప్పుడు ఏ ఒక్కసారీ నీ దృష్టిని అతడు చూరగొనలేదట. పాపం అతడు కేవలం ఒక్కసారి నీవు అతనిపై నీ కటాక్షవీక్షణములు ప్రసరిస్తే చాలని తపన పడుతున్నాడు." అని విషయం చల్లగా వివరించాడు.

అందుకు బాబా "అలాగా! మరయితే నీవు ఎందుకు అలాగ జరగనిచ్చావు? అతడిని గురించి నాకు ముందుగానే ఎందుకు చెప్పలేదు?" అన్నారు. "లేదు బాబా! నేను నీ దృష్టి అతడిపై పడుటకు అతడు నీ చెంతకు రాగానే విన్ను పిలిచాను. అయితే నీవు యెటో చూస్తూ యెవరితోనో మాట్లాడుతున్నావు" అన్నాడు.

ఆయన చిరునవ్వుతో ఒకనిమిషం ఆగి "యీరూచ్! మీరు నేర్చుకోవలసినది ఎంతోవున్నది. చూడు! నా చేతిని యిలా యీ దీపంపై అడ్డంగా వుంచితే అటుచూడు! ఆ గోడమీద దాని నీడ పడింది. నీవా నీడను చూడగలుగుతున్నావు. అలాగే మానవులలో తెల్లవారున్నారు, నల్లవారున్నారు, పొట్టివారున్నారు, పొడుగువారు ఎందరో, ఎన్ని రకాలవారో వున్నారు. మరి వారంతా ఎవరికి చెందినవారో, ఎటువంటివారో నీవు ఎరుగుదువా? వారంతా ఆధ్యాత్మిక సంబంధం కలవారో, కారో తెలుసుకోగలవా? లేదు.

మీరు, మానవులను చర్మచక్షువులతో చూసి అంచనా వేస్తారు. నేను మనుషులను అలా చూడను. నేను చూసేది వారి ఆత్మలోవుండే వెలుగు. కొందరు ఎంతో పవిత్రమైన వ్యక్తులుగా వున్నట్లు కనబడుటకు ప్రయత్నిస్తారు. వున్నతమగు వారివలె సంచరిస్తారు. అట్టివారిగురించి

నేను ఎరుకతో వుండను. నేను చూడగలిగినవారినిగురించే మాట్లాడెదను. అట్టి అర్హత వున్నవారినే చూచెదను.

ఉదాహరణకు నీవు నీ స్నేహితునితో వీదివెంట వెడుతూవుంటావు. అది చాలా సందడిగావుండే బజారు. ఎందరో సంచరిస్తూవుంటారు. అందులో హఠాత్తుగా ఒక అందమైన అమ్మాయి కనబడినప్పుడు నీవు తప్పక నీ దృష్టిని ఆమెవైపు మరల్చెదవుగదా! మరి యిదేమాదిరి నా దృష్టికూడావుంటుందా? నా దృష్టికి ఆకర్షణ ఎదుటివారి ఆత్మలో వుండవలసిన కాంతిరేఖ. ఆ కాంతిలేనిచోట నా దృష్టి పడదు" అని చెప్పిరి.

బాల్యదశలో మేర్వానుకు దశవర్షములు పూర్తి అగుసరికి ఆయనలో వ్యక్తిగత శ్రద్ధలు విశాలమైనవి. ఆటపాటలందేకాక, చదువులందుకూడా ప్రతిభ చూపెను. తరగతి నాయకుడయ్యెను. పూనా పట్టణంలో క్రమ శిక్షణకు పేరెన్నికగన్న రోమన్ కాథలిక్ పాఠశాలలో అతడు తోటి విద్యార్థులచే మాత్రమేకాక, వుపాధ్యాయులందరిచేత కూడా ప్రశంశించబడెను.

విరామసమయంలో షేక్స్పియర్, వర్డ్స్‌వర్త్‌లనుండి హాఫీజువరకు ప్రాశ్చిమ కవులెందరివో వుత్తమ రచనలను చదివి ఆనందించెడివాడు. భారతీయ సాంప్రదాయానుసారం ఆయన ఎన్నో గీతములను రచించెను. పర్షియన్, ఆంగ్లభాషలలోకూడా పెక్కు రచనలు చేసెను.

మేర్వాన్ రచనలు పెక్కు వార్తాపత్రికలలో, వార, మాస పత్రిక లలో ప్రచురించబడేవి. మేర్వాన్ ప్రతిభావంతుడనుటకు నిదర్శనంగా అతడు రచించిన కథ ఒకటి విశేషప్రచారంతో జాతీయ పత్రికలన్నింటి యందు ప్రచురించబడినది.

బాల్యదశనుండియే, యీ విధంగా బహుళ ప్రజ్ఞావంతుడై మేర్వాన్ సైంటువిన్‌సెంటు ఉన్నత పాఠశాలలో విద్య ముగించి, తన 1.వ యేట పూనా దక్కన్ కళాశాలలో ప్రవేశించెను. తన కాలేజీ జీవితం ఆరం భంలో చూపిన ప్రతిభను ఆసాంతం కొనసాగించి, తన సహాధ్యాయులందరి

చేత సహజ నాయకుడుగా అంగీకరించబడెను.

అయితే మేర్వాన్ తన కళాశాలవిద్యను పూర్తికావించలేదు. ఆయన జీవితంలో 18వ ఏడు అత్యంత ప్రాధాన్యత సంచరించుకున్నది. 1913వ సంవత్సరం మే నెలలో ఒకనాటి మిట్ట మధ్యాహ్నం, ఆయన సాధారణ పునికికి హఠాత్తుగా భంగం వాటిల్లినది.

# తెర తొలగింపు

ఆ రోజులలో పూనా నగర నడిబొడ్డునవున్న ఒక వేపచెట్టుక్రిదం దాదాపు 107 సంవత్సరముల వయోవృద్ధురాలు రోజంతా గడుపుతూ, సాధు మూర్తి యగు సద్గుర్విణిగా ప్రసిద్ధిచెందినది.

జగత్ప్రసిద్ధిగాంచిన యీామె సందర్శనార్థం, అనునిత్యం వేలాది మంది భక్తులు వచ్చి ఆమె ఆశీర్వాదం పొందేవారు. ఆమె సమక్షంలో ఎంతోసేపు గడిపి, ఆమె దివ్యబోధలు వినేవారు.

ఒకనాటి మధ్యాహ్నం మేర్వాన్ దక్కన్ కళాశాలనుండి తన సైకిల్‌పై గృహోన్ముఖుడై వస్తున్నారు. రోజూ వచ్చే దారి అది. ప్రతి రోజూ మేర్వాన్ తన సైకిల్‌పై బాబాజాన్ వుండే వేపచెట్టు దారివెంట వెళ్ళేవారు. వస్తూ పోతూ బాబాజాన్‌దర్శనం మనస్సులోనే చేసుకుంటూ వుండేవారు. అయితే మేర్వాన్, అయస్కాంతం యినుమునాకర్షించినట్లు బాబాజాన్‌చే ఆకర్షింపబడెను.

ఆనాటి మధ్యాహ్న సమయంలో సైకిల్‌పై వస్తున్న మేర్వానును బాబాజాన్ కనుసైగలతో చెంతకు రమ్మని పిలిచి, ఆతడి భృకుటిమధ్యంలో నుదుటిపై చుంబించినది తద్వారా ఆతనిలో అంతరంగికంగా శక్తి ప్రవేశపెట్టబడినది. కనుబొమలమధ్య కేవలం ఒకేఒక ముద్దుతో, బాబా జాన్, మేర్వాన్‌లో అనంతచైతన్యానుభూతిని కలిగించెను. చెప్పలేని ఆనందానందానుభూతితో మేర్వాన్‌ను దాదాపు తొమ్మిదినెలలు బాబాజాన్ పాద సన్నిధియందు ఆధ్యాత్మిక సమాధిస్థితిలో గడిపెను.

ఎప్పుడయితే మేర్వాన్ యావత్తు చైతన్యభూమికల అనుభవం పొందెనో, ఆ మరుక్షణంలోనే సాధారణ భౌతిక ప్రపంచ భావన కోల్పోయెను. మూడు రోజులపాటు అసలు కదలలేదు. ఆ తరువాతకూడా యాంత్రికంగా తిరుగదొడగెను. పూర్తిగా అచైతన్యుడై సాధారణ మానవచైతన్యం కోల్పోయివున్నాడు. ఇది గమనించిన ఆయన తల్లి షిరీన్‌మాయి, "ఏదో వ్యాధి సంక్రమించినది. యిది పిచ్చికాదుకదా!" అని వైద్యుని పిలిపించినది. తండ్రయితే విషయం అవగాహన చేసుకున్నాడు. కానీ ఏమీ బహిర్గతపరచలేదు.

ఎన్ని మందులు వాడినా ఫలితం శూన్యం. డాక్టర్లేమీ చేయలేక పోయారు. నిద్రలేదు. ఆందోళన చెందిన తల్లి, దీనికంతటికీ ఆ బాబాజాన్ మాత్రమే కారణమని తలంచి, ఆమె చెంతకువెళ్ళి తన కుమారునికేమివేసినదో చెప్పమని ఒత్తిడి చేసినది.

అందుకు ఆమె బదులు చెప్పుతూ "అమ్మా! యితడు నీకుమాత్రమే బిడ్డడుకాడు. యీ లోకానికంతటినీ మేల్కొలుపవలసివున్నాడు" అన్నదట. ఆ మాటల అర్థం ఆందోళనలోవున్న షిరీన్‌మాయి గ్రహించలేకపోయినది. మేర్వాన్‌కు యీ తొమ్మిదినెలలుకూడా నిద్రాహారాలు లేవు. నిద్ర వచ్చుటకు మత్తుమందులు వాడినా ప్రయోజనం కనిపించలేదు. ప్రతిక్షణం మేర్వాన్ తన శరీరంపైగానీ, తదితరమైన ఏ భౌతికవిషయంపైగానీ ఎరుక కలిగిలేడు.

అయితే అదే సమయంలో ఈ జగత్తులో ఏ ఒక్కరూ అర్థం చేసుకోలేనట్టి వ్యథలను అనుభవించినట్లు బాబాయే చెప్పిరి. తన బాధల నుండి విముక్తుడగుటకు, తన తలనొక శిలపై మోదుకొనెడివాడు. నేలపైనా, గోడలపైనా తన తలను బాదుకొనేవాడు. తనను తాను నిలదొక్కుకొనలేకపోయెను.

యిలా వ్యథలనుభవిస్తూ 1915లో తదుపరిఘట్టం ప్రారంభమైనది.

స్థలమార్పునాశించి తద్వారా మేర్వానులో వుపశమనం కుదరవచ్చుని భావించిన తలిదండ్రులు, మేర్వాన్‌ను బొంబాయిలో వుంటున్న ఆయన అన్నగారి యింటికి పంపిరి. అక్కడ సామాన్య ప్రాపంచిక సౌఖ్యములు కొంతవరకు అనుభవించెను.

చివరగా 1915 డిశంబరులో సద్గురు షిర్డీసాయిబాబావద్దకు వెళ్ళాలనే భావన మేర్వాన్‌లో కలిగినది. తలంపు వచ్చినదే తడవుగా మేర్వాన్ వెంటనే షిర్డీ బయలుదేరెను. అప్పుడు సాయిబాబా చుటూ జనసందోహమున్నది. అయినప్పటికీ నడిరోడ్డుమీద మేర్వాన్ ఆయనముందు మోకరిల్లి సాష్టాంగప్రమాణమాచరించెను.

అంత సాయిబాబా కరుణతో మేర్వాన్‌నులేవదీసి "ఓ పర్వర్దిగార్!" అని సంబోధించెను. దీనిఅర్థం "సకల స్థితికి కారకుడగు భగవంతుడా!" అని.

పిమ్మట, అచ్చటికి సమీపంలోనేవున్న ఖండోభా దేవాలయంలో వున్న ఉపాశినీ మహారాజును చూడనిశ్చయించి, ఆయనదగ్గరకు వెళ్ళెను. అక్కడకు వెళ్ళగానే మహారాజు మేర్వాన్‌ను ప్రేమతో ఆదరించి, చేరదీసి, చిన్న గులకరాతిని బలంగా విసిరి స్వాగతం పలికెను.

అలా విసిరిన ఆ రాయి తిన్నగా మేర్వాన్ భృగు మధ్యంలో, సరిగ్గా బాబాజాన్ ముద్దుపెట్టుకున్న చోటునే పడి దెబ్బ తగిలినది. అది బలంగా తగులుటవలన చిప్పిన రక్తం చిమ్మినది. అయితే ఉపాశినీ మహారాజు అలా ఆ దెబ్బద్వారా, భగవత్సాక్షాత్కారంతో దివ్యోన్మాద స్థితిలోవున్న మేర్వాన్‌కు దైవజ్ఞానపు ఎరుక కలిగించెను.

దరిమిలా తాజుద్దీన్‌బాబా, నారాయణ మహారాజుల నాశ్రయించి వారి సాన్నిహిత్యంలో రానురాను మామూలు ప్రపంచ స్పృహకి వచ్చెను. అయితే అదేసమయంలో అతడు ఆత్మ సాక్షాత్కారముయొక్క ఆనందానుభూతిని అనుభవించెను.

చివరగా 1921 లో మేర్వాన్ పరిపూర్ణుడై, సంపూర్ణ ఆధ్యాత్మిక గురువుగా రూపొంది 1921 జూలై నుండి డిశంబర్ మాసమువరకు సాకోరీలో ఆరునెలలపాటు మహారాజుసన్నిధిలో గడిపెను. ఆ సమయంలోనే ఉపాశనీ మహారాజు, మేరాన్‌కు తానెవరో ఎరుకకలిగించెను.

ఈ విధంగా తన 28వ యేట 1922లో మేర్వాన్ సర్వ స్వతంత్ర ఆధ్యాత్మిక గురువుగా తన కార్యక్రమము ప్రారంభించెను. 1922 జనవరి మేనెల మధ్య ప్రప్రథమంగా పూనాలోని కస్బాపేటలో, నిర్జన ప్రదేశంలో ఒక పొలంలో ప్రత్యేకంగా నిర్మింపబడిన పూరిపాక (ఝోంపడి)లో కొద్ది మంది శిష్యులతో స్వతంత్ర జీవనం గడుపుట ప్రారంభించెను.

ఆ సమయంలోనే ఉపాశనీ మహారాజు తన శిష్యులనుద్దేశించి ప్రసంగిస్తూ "నేనిప్పుడు నా ఆధ్యాత్మిక అధికారమునకు సంబంధించిన తాళపుచెవిని మేర్వానుకు వప్పగించితిని. అందువలన యిప్పటినుండి మీరంతా అతనిని అంటిపెట్టుకొనివుండి, అతని ఆజ్ఞలకు తలవగ్గి నడుచు కొనుడు" అని ప్రకటించెను. అప్పటినుండి బాబాను అనుసరించే శిష్యుల సంఖ్య పెరిగినది. 1922 జూన్ మాసంలో ఆయన తన మొదటి ఆశ్రమమును బొంబాయిలో ఒక అద్దె యింటిలో ప్రారంభించారు. దీనికి మంజిల్-ఇ-మీమ్ అని పేరు పెట్టారు. యీ ఆశ్రమంలో ఆయన శిష్యులుగా దాదాపు నలుబదిమంది వివిధ మతాలకు, కులాలకు సంబంధించిన వారు చేరారు. అక్కడ కొన్ని నెలలపాటు శిష్యులందరికీ బాబా ఆధ్యాత్మికపరమైన, కఠోర నియమాలు విధించి పాటించునట్లు చేశారు.

తరువాత బొంబాయిలోని ఆశ్రమాన్ని ఎత్తివేసి, అహ్మదునగరుకు పదికిలోమీటర్ల దూరంలోవున్న అరంగాం సమీపంలో శాశ్వత కేంద్రాన్ని స్థాపించారు. ఈ స్థావరమే ఈనాటి మెహెరాబాదుగా ప్రసిద్ధిచెందినది. యిక్కడే మెహెర్‌బాబాయొక్క సమాధి వున్నది. ఈనాడది యెంతో పవిత్ర క్షేత్రమయినది. ఆబాద్ అనగా వెలుగొందుట అని అర్థం. ఈ

ఆశ్రమ స్థాపన జరిగిన తర్వాత ఆయన అక్కడ ఒక ఉచిత వైద్యాలయం, పాఠశాల, ఉచిత భోజన వసతిసౌకర్యం మున్నగునవెన్నో నెలకొల్పి నడిపారు. 1925వ సంవత్సరంవరకు ఆయన తన మండలిలోని వారందరిని, అనేక ఆధ్యాత్మిక కార్యక్రమాల నిర్వహణలో యావద్భారతము తిప్పారు. ఎన్నో కష్టములు, యిడుములు మధ్య, తన అంతరంగిక కార్య విధాన సరళిలో బాబా ఎక్కువకాలం కఠిన ఉపవాసములు, ఏకాంత జీవనం కొరకు వెచ్చించారు. ఆయన శిష్యుల సంఖ్య బాగా పెరిగిపోయి అయిదు వందలపై చిలుకుకు దాటినది. ఆరంగాం చిన్న పట్టణంవలె వెలగొందినది హోటళ్ళు, పూలకొట్లు, తినుబండారముల దుకాణములతో కళకళలాడెది.

శిష్యులంతా ఆశ్రమంలో శ్రమజీవనం గడిపేవారు. ప్రతి పని, కుల భేదం లేక, కలిసికట్టుగా, స్వయంగా చేసుకునేవారు. అక్కడ నెలకొల్పిన వైద్యాలయం, డిస్పెన్సరీ, పాఠశాల వగైరాలలో వారంతా పనిచేసేవారు. మగపిల్లలకు, పురుషులకు, స్త్రీలకు విడివిడిగా ఆశ్రమాలుండేవి పేదలకు కుష్టురోగులకు వేర్వేరు ఆశ్రమాలుండేవి. బాబా ఒకసారి వీటి నిర్వహణ కారణం గురించి వివరిస్తూ, యివన్నీ తాను నిర్వహించవలసివున్న విశ్వ కార్యక్రమంలో భాగాలనీ, అవి ప్రత్యేకంగా పేదలకు, అవిటివారికి నిర్దేశించబడిన నిస్వార్ధ సేవా కార్యక్రమములయినప్పటికీ తద్వారా తన శిష్యులకు ఆధ్యాత్మిక శిక్షణకొరకు నిర్వహించబడుచున్నవని చెప్పారు.

## సన్నిధి మండలి

అవతారుని పరివేష్టించి పది బృందాలతోకూడిన మండలి వుంటుంది. ఒక్కొక్క బృందంలో పన్నెండుమంది పురుషులుకాక మరి యిద్దరు స్త్రీలు జోడించబడుదురు. ఈ పన్నెండుమంది, జోడించబడిన యిరువురు స్త్రీలతో అవతారుని జీవితకాలంలో నడిపే దైవనాటకంలో చక్కని పాత్ర పోషణ చేసి, దైవసాక్షాత్కారము పొందుతారు.

ఈ పన్నెండుగురు శరీరత్యాగానంతరం మళ్ళీ ఈ భూమినపై

జన్మించరు. వారి ఖాళీలు తదుపరి బృందంలోని సభ్యులతో పూరింపబడి, మరలా భగవంతుడు అవతారుడుగా అవతరించినప్పుడు వీరుకూడా దైవ నాటకంలో పాత్రధారులై అంత్యంలో దైవసాక్షాత్కారం పొందుతారు.

యిదేమాదిరి ఈ పది బృందములు ప్రతి అవతార సమయంకోసూ, క్రమేపీ ఒక్కొక్కటిగా ముందుకు సాగుతూ ప్రథమ బృంద స్థానమునకు ఆఖరిబృందం చేరుకొనును. అలాగే క్రమంగా పరిణితి చెందిన ఆత్మలు కొన్ని సామాన్య మానవదశనుండి పెరిగి అన్నింటికంటే ఆఖరిబృందంలో చేరుటకుపక్రమించును.

దైవ ప్రణాళికలో యిది అత్యంత ప్రధానమైన చర్య. అవతారుని కృపవలన, తన అంతరంగిక సన్నిహిత మండలిలోని పదునలుగురుకూడా అదే అవతారకాలంలో దైవసాక్షాత్కారము పొందెదరు. ఈ పుడమిపై అవతారుని ఆగమనం జరిగిన దరిమిలా వంద సంవత్సరాల కాలపరిధిలో యిట్టి సాక్షాత్కారప్రాప్తి, ఆయన సన్నిధిమండలి సభ్యులకు ప్రాప్తించ గలదు.

యిక్కడ గమనించదగిన మరో విశేషమేమంటే, ఒక అవతారుని కాలంలో ఆయన సన్నిధిమండలిలోవున్న పదునాలుగుమంది సభ్యులకు వుండే సహజ లక్షణాలే మనస్సుకు, హృదయానికి వుండే గుణములే, తదుపరి అవతార కాలంలో వచ్చే సన్నిధిమండలివారు కూడా కలిగి వుంటారు.

ఉదాహరణకు క్రీస్తు అవతారంలో ఆయన సన్నిధిమండలిలో పీటరు ఒకడు. మరి క్రీస్తు తన తదుపరి అవతరణ జరిగినప్పుడు ఆయనను పరివేష్ఠించివుండే సన్నిధి మండలిలో క్రీస్తు అవతారంలో వున్న మండలి సభ్యుడైన ఆ పీటరుకు వుండే లక్షణాలు, గుణాలుకల మరో పీటరు, పేరు మార్పుతోవున్నప్పటికీ అవే లక్షణములు కలిగి సన్నిధి మండలిలో వుంటాడు.

అలాగే జూనాస్, జాన్, జేమ్స్ వగైరా, వగైరా. వీరందరి లక్షణాలూకల సభ్యులే తదుపరి బృందంలో వుంటారు.

ఈ వైనమంతా మనకు సుబోధకమగుటకు బాబా ఎంతో వివరంగా చెప్పిరి. ఆయన చెప్పిన విషయాన్ని వారి స్వంతమాటలతో 1955 అవేకనర్ వాల్యూంలో ప్రచురించబడినది.

ఈ ప్రప్రథమ బృందంలో అనగా అవతారుని సన్నిధి మండలిలో వుండే శిష్యులకు కేటాయించబడే ప్రత్యేక విధులేమైనా విధించబడునా అని తెలుసుకొనుటకు పాశ్చాత్యులు బాబాను అనేక ప్రశ్నలడిగి విఫలులైరి.

అయితే మండలిలో అనుభవజ్ఞుడైన ఒకరు తాను సముపార్జించిన అనుభవంరీత్యా ఈ క్రింది విధముగా సన్నిధిమండలిలోని 12 మందికి విధులు కేటాయించబడునని వారికి వివరించెను.

ప్రథమ మిత్రుడు :- ప్రేమించును, మరియు ప్రేమించబడును.
రెండవవాడు :- సహజ, హాస్యప్రసంగి, విదూషకుడు.
మూడవవాడు :- గాయకుడు.
నాల్గవవాడు :- కాపలాదారు.
ఐదవవాడు :- సేవకుడు. వ్యక్తిగత అవసరములనెఱవేర్చును.
ఆరవవాడు :- వంటవాడు· వండి అవతారునికి, శిష్యులకు వడ్డించును.
ఏడవవాడు :- గృహావసరములు చూచు మేనేజరు
ఎనిమిదవాడు :- కోశాధిపతి
తొమ్మిదవవాడు :- వైద్యుడు· శారీరకంగా, అవతారుని కనిపెట్టుకొని వుండును.
పదవవాడు :- రచయిత. వ్రాతగాడు.
పదకొండవవాడు :- వార్తాహరుడు.
పన్నెండవవాడు :- విమర్శకుడు (న్యాయపాలకుడు)

అయితే బాబా సన్నిధిమండలిలో 12మంది శిష్యులతోపాటు యిరువురు స్త్రీలు జోడించబడుదురని చెప్పియున్నందున, శిష్యుడు చెప్పిన పై వివరణకు పాశ్చాత్య ప్రేమికులు తృప్తిచెందలేదు. పైన వివరణ పన్నెండుగురితోనే ముగిసినది. అందుచేత వారు ఒక పర్యాయం యీ విషయమై బాబాముందు చర్చకు తేగా ఆయన ఈ విధంగా వారికి అనుమానమునివృత్తి చేసిరి. "తన ఆంతరంగిక మండలితో జోడించబడిన యిరువురుస్త్రీలు ఒకరు ప్రగాఢప్రేమకు, మరొకరు సేవకు తార్కాణము. ఈ ప్రస్తుత అవతారకాలంలో "మెహెరా" ప్రేమకు "మణి" సేవకు ప్రతీకలు. జీసస్‌క్రీస్తు కాలంలో ఆయన తల్లి "మేరీ" ప్రేమకు "మార్తా" సేవకు ప్రతీకలట.

1948లో అమెరికా వెళ్ళినప్పుడు డేలియా డెలియన్‌తో బాబా తాను ఎన్నడు మెహెర్‌గురించి ఎవరికి విశదీకరించలేదని ప్రథమంగా ఆమెతోనే వివరిస్తున్నానని చెబుతూ "నేను మణిని ప్రేమిస్తున్నానని నీవు వూహించుట లేదా? సరే, మెహెరా విషయంలో ఆమె, జీసస్‌ను వర్జిన్ మేరీ ఏ విధంగా ప్రేమించెడిదో అదేమాదిరి పాత్రను మెహెరా ప్రస్తుతం పోషిస్తున్నది. ఆమె నా శరీరంపై చర్మమువంటిది. నాకు కలిగే ప్రతి ఆలోచనను ఆమె గ్రహించును. నాకు రక్షణ కలిగించి, నా భావములు తాననుభవించును. అయితే, నేనందరిని ప్రేమిస్తాను. ప్రతివారు తాము నిర్వర్తించవలసిన పాత్ర నిర్ణయించిన ప్రకారం నిర్వహించవలయును. కానీ ఆధ్యాత్మిక క్షేత్రంలో వాటన్నిటికంటే అత్యంత సన్నిహితంగా నాతో కొందరుందురు" అన్నారు. దాదాచాన్జీకూడా ఈ విషయంలో ఒకసారి బాబా తనతో "మెహెర్ నా శ్వాస– ఆమె లేకుండా నేను జీవించలేను" అన్నట్లు చెప్పెను.

అవతారుడు తనకు సన్నిహితంగావుండే ఆంతరంగిక మండలిని వున్నత భూమికలకు చేర్చినప్పటికీ వారున్న స్థితిని వారికెరుకలేకుండా చేసి

ఒక తెరను కప్పివుంచును.

ఇందుకు చక్కని ఉదాహరణగా భారతంలోని ఒక గాథను మండలిలో ఒకరు ఈ విధంగా చెప్పగా రికార్డు చేయబడినది. ఈ కథ శ్రీకృష్ణావతారమునకు సంబంధించినది. కృష్ణుని శిష్యులలో నారదుడు అగ్రగణ్యుడు. చాలా సంవత్సరములు శ్రీకృష్ణునికడ శిష్యరికం చేసిన నారదునికి, నిరుత్సాహం కలుగుట ప్రారంభించినది. ఎంతకాలం ఏకాగ్రతతో శుశ్రూష చేసినా, ఆధ్యాత్మికంగా అభివృద్ధి సాధించలేకపోతినని నారదుడు నిరుత్సాహపడ్డాడు. ఈనాటి అనేకమంది మాదిరిగా, అతడు ఆధ్యాత్మిక అనుభవం పొందాలని ఆపేక్షించాడు. అట్టి అనుభవం కలిగినప్పుడే తాను ఆధ్యాత్మికంగా పెరిగినట్లు రుజువని తలచెను. అందుచేత ఒకరోజున ఈ విషయాన్ని కృష్ణునివద్ద ప్రస్తావించి, తన జీవితమంతా కృష్ణుని సేవలో అంకితం చేసుకున్నప్పటికీ, గురువుని, అసలు ఏనాడు కలువని చాలామంది యితరులకంటే హీనంగా వున్నదని వాపోయెను.

అందుకు కృష్ణుడు నారదునికి అభయమిస్తూ, భౌతికంగా, భక్తిపూర్వక ప్రేమమయ జీవితాన్ని కృష్ణునితో గడుపుటవలన, గట్టిగా చెప్పాలంటే అతడు సాక్షాత్తు భగవంతుని సన్నిధానంలో వున్నట్లే. మరి ఏదో ఒకరోజున తానెంతటి ఆధ్యాత్మిక ఔన్నత్యం పొందినదీ తెలుసుకొనగలవని వూరడించెను.

నారదుడు, సంవత్సరములు గడిచినా ఎట్టి జ్ఞానము సముపార్జన చేయిలేకపోతిననే భ్రాంతిలో వుండిపోయాడు చివరకు కొన్ని సంవత్సరములు అలా మదనపడినతరువాత, ఒకరోజున కృష్ణుడు నారదుని పిలిచి, ఫలానారోజున ఫలానా తోటలోవున్న ఫలానా చెట్టువద్దకు వెళ్ళి నేలపై పరికించిచూడమని ఆజ్ఞాపించెను.

ఎందుకని ప్రశ్నించక, నారదుడు గురువాజ్ఞ పాలించి, గురువు ఆదేశానుసారం అలాగే చేసెను. అయితే అక్కడ అతనికి ఎండిన

కట్టెలగుట్ట మాత్రమే కనబడినది. ఎంతకూ అక్కడ ఆ కట్టెలపోగుతప్ప మరేదీ కానరాకపోయేసరికి నారదునితో సహనం నశించింది.

అక్కడ ఏకాగ్రతతో కళ్ళు పెద్దవిచేసుకొని ఎదురుచూస్తూ నిలబడి వున్నాడు. మనస్సులో భావాలు మెదులుతున్నాయి. తాను అసమర్థుడనని, అసాధ్యుడనని తలపోస్తున్నాడు. చివరకు, ఎదురుగావున్న గుట్టలో ఒక కట్టెనుండి ఒక పురుగు ప్రాకుతూ వచ్చింది. దానిపై నారదుని దృష్టి పడగానే అది క్రిందపడి వెంటనే మరణించింది.

అది జరిగిన తరువాత, నారదుడు వెనుదిరిగి గురువువద్దకు చేరుకున్నాడు. ఏమిజరిగిందని గురువు అడిగినప్పుడు జరిగినదంతా నారదుడు వివరంగా చెప్పాడు. నారదుని మనసంతా పరితాపంతో వున్నది. తానిక్కడ దైవమానవుని చెంత గడుపుతున్నప్పటికీ, తానొక అర్థ్వమగు జీవితం గడిపే వ్యక్తిననే అనుభవం తనకు కలగనందుకు విచారంతో వున్నాడు.

కృష్ణుడుమాత్రం ఏమీ ఎరుగనట్లు నారదుని కొన్నాళ్ళపాటు విస్మరించాడు. తరువాత ఒకరోజున, మళ్ళీ నారదుణ్ణి పిలిచి, అడవిలో ఫలానా చోటుకు వెళ్ళి అక్కడవున్న ఒక చెట్టుదగ్గరనిలబడి ఏమి జరుగబోతున్నదో చూచివచ్చి చెప్పమని ఆజ్ఞాపించెను.

చెప్పినరోజున బయలుదేరిన నారదుడు కృష్ణుని ఆజ్ఞానుసారం ఆ చెట్టుదగ్గర నిలబడి ఏమి జరుగునో అని ఎదురుచూస్తున్నాడు. అంతలో హఠాత్తుగా ఆ చెట్టు కొమ్మమీద ఒక అందమయిన రామచిలుక కనిపించింది. ఎప్పుడయితే నారదుని దృష్టి ఆ చిలకపై పడిందో, ఆ మరుక్షణమే ఆ చిలుక మృతిచెందింది.

ఈ సంఘటనతో నారదునికి భయం పుట్టింది. మొదటిసారి తన దృష్టి పడిన ఆ పురుగు మరణించింది. ఈసారి తన దృష్టి పడగానే చిలుక మరణించింది. "ఏమిటీ వైపరీత్యం? దీనినిబట్టి తాను ఒట్టి అసమరు

దన్నమాట. ఎందుకూ పనికిరానివాణ్ణి" అని వ్యసనపడ్డాడు. ఏమైనప్పటికీ తానెందుకూ పనికిరానివాడిననే ప్రగాఢభావం యిప్పుడతనిలో మార్పు చెందింది. దీనికంతటికీ తానింతకాలంగా దైవీమానవునితో గడుపుటే కారణం కావచ్చును అనే వూహ వచ్చింది.

కృష్ణుడు కొన్నాళ్ళపాటు నారదుని విస్మరించాడు. ఆ తరువాత ఒకరోజున నారదుణ్ణి పిలిచి, ఫలానా ఊరి కరణంగారి యింటికి వెళ్ళి వారింట్లో క్రొత్తగా పుట్టిన గుర్రపుపిల్లను చూసి రమ్మన్నాడు. విషయం విన్న నారదుడు భయకంపితుడైనాడు.

అయితే తాను విధేయతతో గురువాజ్ఞ పాటించాలనితలంచి, గురువు ఆజ్ఞ పాటించి, కరణంగారింటికి వెళ్ళాడు. వెళ్ళగానే కరణంగారు నారదుణ్ణి సగౌరవంగా స్వాగత సత్కారములు జరిపి, ఆహ్వానించారు. అతిథి మర్యాదలు జరిపినతరువాత నారదుడి రాకకు కారణం తెలుసుకొనుటకు ప్రయత్నించగా, వారింట క్రొత్తగా పుట్టిన గుర్రపుపిల్లను చూచిపోదామని వచ్చినట్లు తెలిపాడు.

యజమాని మిగుల సంతోషించి, ఎంతో గర్వంగా ముద్దులొలికే గుర్రపుపిల్లను దొడ్డోనుండి తీసుకవచ్చి నారదుడికి చూపించాడు. నారదుడి చూపులు గుర్రపుపిల్లపై పడీపడగానే అది మరణించింది. ఫలితం ముందే వూహించిన నారదుడు గడగడా వణికిపోయాడు. అయితే యజమాని యిదేమీ ఎరుగనందున, ఆ గుర్రపుపిల్ల మరణానికి నారదుడే కారణమని తెలియలేకపోయెను.

మరికొంతకాలం గడిచిన తర్వాత, పొరుగురాజు ఒకాయన కృష్ణుని దగ్గరికి వచ్చి, తనకు లేకలేక పుట్టిన బిడ్డను ఆశీర్వదించమని వేడుకున్నాడు కృష్ణుడు తన తరఫున నారదుని పంపుటకు నిశ్చయించుకున్నాడు. కానీ అది విని నారదుడు భయపడిపోయాడు. తన దృష్టి పడగానే యువరాజు కూడా మరణిస్తాడేమోనని భయపడ్డాడు.

సర్వజ్ఞుడైన కృష్ణుడు నారదుని ఓదార్చి, ఉత్సాహపరచి, ధైర్య వచనములు చెప్పసాగాడు. దానితో అప్పటికి మూడుసార్లు అపజయమే ఎదురైనప్పటికీ, యీసారి ఏమైనాసరే వెళ్ళి క్రొత్తగా పుట్టిన బిడ్డను చూచి ఆశీర్వదించి రావాలని నిశ్చయించుకొన్నాడు.

నారదుడు శ్రీకృష్ణునికి అత్యంత యిష్టుడైన శిష్యుడని ఎరిగిన ఆ రాజు ముందుగానే తన నగరంచేరి, నారదుడుకి సకల రాజలాంఛనాలతో స్వాగత సత్కారములు ఏర్పాటు చేసాడు. నారదుడు రాగానే ఘనవైభవంతో అతిధిమర్యాదలు పూర్తి అయిన పిదప, అంతఃపురంలో వూయల యందూగుచున్న బాలకుని కడకు నారదుని తోడ్కొనిపోయి ఆశీర్వదించమని అర్ధించెను. అందుకు నారదుడు, ఆ బాలకుని కృష్ణుడే ఆశీర్వదించెను కనుక తన ఆశీర్వాదములతో పనిలేదని చెప్పి, కనీసం ఆ బాలునివైపు చూచుటకుకూడ తిరస్కరించెను. యదార్ధంగా ఆ బాలునివేపు దృష్టి ప్రసరింపలేదు.

అప్పుడాబిడ్డడు చివాలున వూయల్లోనే లేచికూర్చొని, అంతవరకు నారదుడు చేసిన ప్రతిఫలానికి తన ధన్యవాదములు ప్రకటించి, మళ్ళా యిప్పుడుకూడా తన దృష్టిని నాయందేల ప్రచురించటలేదని ప్రశ్నించెను. మీ దర్శన భాగ్యం, మీ దృష్టి నామీద ప్రసరింపచేయుటకేల సంకోచించుచున్నారని ప్రశ్నించెను. అది విన్న నారదుడు, విశ్చేష్టుడయ్యెను. "నేనేమి చేయలేదు. మరి నీ ధన్యవాదములు నాకేల?" అంటూ ఎదురుప్రశ్న వేశాడు.

అందుకాబిడ్డ జవాబుగా "నేనొకప్పుడు పురుగు జన్మ ఎత్తగా మీ దర్శన భాగ్యము కలిగినది. తత్ఫలితంగానేనింకా ఎత్తవలసిన ఎన్నో పునర్జన్మలు తుడుచుకుపోయి వాటినుండి తప్పించుకొన్నాను. నేను ఆ మరుక్షణంలోనే ఒక చిలుక జన్మ ఎత్తాను. మరి ఆ జన్మలోకూడా నా అదృష్టవశమున మీ దర్శన భాగ్యము కలిగినది. వెంటనే గుర్రపు పిల్లగా

వున్నప్పుడు మీరు మళ్ళా నా ఎదుట సాక్షాత్కరించారు. మరి అట్టి అదృష్ట సంగమం నన్ను యిక్కడకు వచ్చునట్లు వేగిర పరచినది. ఆనాటి మీ దర్శన ప్రభావం చేతే దుర్లభమైన యీ మానవజన్మ సంప్రాప్తించింది. మళ్ళా యిప్పుడుకూడా మీ దృష్టి నాపై ప్రసరించితిరేని, నేను నా గమ్యం చేరి శాశ్వతానంద ప్రాప్తి పొందగలను" అని పలికెను.

చివరకు నారదుడు తేలిక మనస్సుతో తిరిగి కృష్ణుని చెంతకు పోయాడు. చిరునవ్వుతో కృష్ణుడు నారదుని కౌగలించుకుని, "తనకు సేవ చేసిన ఫలితంగా కొంత ఆధ్యాత్మిక ఔన్నత్యం సంపాదించ కలిగినట్లు యిప్పటికైనా నమ్మకం కుదిరిందా?" అని అడిగాడు. నారదుడు సిగ్గుతో తలవంచి, కృష్ణుని పాదములపై పడి, క్షమాపణ కోరుకున్నాడు

అతినిగూఢ ఆధ్యాత్మిక కారణములచేత బాబా 10-7-1925 వ తేదీన భౌతిక మౌనం ప్రారంభించారు. యీ మౌనాన్ని అద్వితీయంగా కొనసాగిస్తూ, తన పాంచ భౌతిక శరీర త్యాగంచేసి, 1979 జనవరి 31 తేదీవరకు నిర్విఘ్నంగా పాటించారు.

ఈ సందర్భంలో బాబా తన మౌనాన్ని గురించి వివరిస్తూ ఒకసారి "నేను మౌనంలో వున్నప్పటికీ, నా సాధారణ కార్యక్రమాలన్నిటినీ యథాతథంగా కొనసాగించాను" అన్నారు. మౌనం ప్రారంభించిన మొదటి దశలో తన సందేశాలను పలకపై వ్రాసి చూపేవారు.

యిప్పటివరకు ప్రచురించబడక అతిరహస్యంగా భద్రపరచబడిన గ్రంథ రాజాన్ని బాబా, చీకటి కొయ్య భోషాణంలో తలుపులు మూసుకొని రోజూ కొన్ని గంటలు తరబడి వ్రాశారు. బాబా స్వయంగా వ్రాసిన యీ వ్రాత ప్రతి మౌనంతో వ్రాసింది.

దాని వివరములు ఎవరికీ తెలియవు. పుస్తకం వ్రాయుట పూర్తి చేయుటకు దాదాపు సంవత్సర కాలము పట్టింది. అది పూర్తి కాగానే, పెట్టెలో భద్రపరచి, తాళం వేసి మండలివారెవ్వరూ దానిని చూడవద్దని

ఆదేశించారు బాబా.

సందర్భం వచ్చినప్పుడల్లా దానిని "నా బైబిలు" అనేవారు బాబా. అందులో యింతకుముందెన్నడూ ఎరుక పరచని, ఎవ్వరికీ తెలియని ఆధ్యాత్మిక రహస్యము లున్నవని, అత్యంత చైతన్యవంతమగు స్థితిలో తన స్వంత అనుభవముల కథ, యింకా శాస్త్రీయపరమగు అనేక నూతన విషయములు యీ పుస్తకంలో వ్రాయబడినట్లు చెప్పారు. తన మౌనవిరమణానంతరము సరియగు సమయంలో ఆ పుస్తకం ప్రచురించబడునన్నారు.

యిప్పుడు యీ వ్రాత ప్రతి యొక్క ఉనికి అంతుపట్టని రహస్యంగా మిగిలిపోయింది.

1927లో వ్రాయుటకూడ విసర్జించారు. తన భావాలను, ఆజ్ఞలను సందేశాలను, అన్నిటినీ, ఎరుక పరచుటకు ఆంగ్ల అక్షర ఫలకమునుపయోగించారు. బాబా కడునైపుణ్యంతో ఆ అక్షర ఫలకంపై తన వ్రేళ్ళను కదిలిస్తూవుంటే, శిష్యులు, ఏక సంతగ్రాహులై ఆయన యిచ్చే సూచనలను కడునేర్పుతో గ్రహించేవారు. బాబా చివరికీ బోర్డునుకూడా 1954లో పరిత్యజించారు. తన సందేశాలన్నిటినీ చేతిసౌజ్ఞలతో యిస్తూవుంటే, శిష్యులు కడునైపుణ్యంతో ఆసౌజ్ఞల భావాన్ని గ్రహించకలిగేవారు.

1921-39 మధ్య దశాబ్దకాలంలో బాబా సన్నిహిత శిష్యులలో యావద్భారతంలోనే కాక, యూరోపు తదితర పాశ్చాత్య ప్రపంచాలలో అనేకసార్లు పర్యటనగావించారు.

సర్వజనులకూ ఆధ్యాత్మిక శ్రేయస్సు చేకూర్చడమే బాబా అవతార లక్ష్యము అవతారమనేది పరోపకారం కొరకేగాని, అవతారపురుషుణ్ణని చెప్పుకోవడానికికాదుఅన్నారు బాబా. నరుణ్ణి నారాయణుడుగా అంటే మానవుడిని దేముడుగా తృటి కాలంలో మార్చగల శక్తి బాబాకున్నది.

అందుకే ఆయన ఆశీస్సులు పొందుటకు, ఆయనను తెలుసుకొనమని, ఆయనను ప్రేమించమని, తన దగ్గరకు రమ్మనమని బాబా ప్రజల్ని

కోరేవారు. అంతరంగంగా ఆయనలో శక్తి, జ్ఞాన, ఆనందములు నిండి వుండుటచేత బాహ్య సహాయం ఆయనకు అవసరములేదు మానవజాతి అంతా ఆనందంగా వుండుట, వారిని తొందరగా భగవంతుణ్ణి తెలుసుకునేలా చెయ్యడమూ బాబా ఆశయాలు. ఆయన దర్శన, స్పర్శ, ఆలింగన భాగ్యములు వ్యక్తిగతంగా ఆత్మ సాక్షాత్కారానికి తోడ్పడ్డాయి.

మెహెర్ బాబాయొక్క కార్యక్రమాలు ఒకచోటుకు కేంద్రీకృతమై ఉండేవికావు. విశిష్ఠ కార్యక్రమములతో కూడినను విశాలమగు ఆయన పరిధి, చిట్టచివరకు, నిరంతర శిక్షణాక్షేత్రమై తన శిష్యులగు స్త్రీపురుషులపై వారు భగవంతుని ప్రేమించునట్టి జీవితమును సాధన చేయుటకు వుపయోగ పడినది.

1940వ సంవత్సరము బాబా నిర్వహించెడి కార్యక్రమాలలో క్రొత్త మలుపు తిరిగినది. యావద్భారతావనిలో దాదాపు 76,000 మైళ్ళు కాలి నడకన మారువేషంలో మౌనంతో పర్యటించి మస్తుకార్యక్రమం నిర్వహించారు. మానసికంగా ఆధ్యాత్మిక పురోగతి సాదించి ఆధ్యాత్మిక తపనతో నిలిచిపోయిన వారు మస్తులు. యిలాంటి మస్తుల్ని అన్వేషించి, వారిని కలిసి, ఆధ్యాత్మిక పథంలో వారు ముందుకు సాగిపోవునట్లు వారికి సహాయపడ్డారు.

మస్తు కార్యక్రమం చాలా కష్టతరమైంది. బాబాయే స్వయంగా మస్తుపర్యటనా కార్యక్రమాన్ని నిర్దేశించేవారు. ఆయనకనువగు సమయం ఎన్నుకొని ఆయనతో అనుసరించుటకు. యిద్దరు ముగ్గురు, బుద్ధికుశలత, చాకచక్యం, నైపుణ్యంకల ఆదీ, చైదుల్, కొకా, యీరూచ్‌లాంటి వారిని ఎంచుకునేవారు. పిచ్చివారిలా కనబడే యీ మస్తులను బాబావద్దకు గాలించి తీసుకురావటమంటే అది వేటాడుటవంటిదే.

ఒకసారి కాకా, చైదులులు మస్తుకార్యక్రమాలలో తాము పొందిన అనుభవములిలా వివరించారు. ప్రతిమస్తుపర్యటన సమయంలో వారున్న

ప్రదేశంచేరాలంటేకాలినడకన, శుష్కమైన యిసుకప్రదేశంలోతిరిగి దట్టమైన అడవులలో గాలించి, పర్వతాలు, లోయల్లో వెతికి, ఒంటెలమీద, గుర్రాల మీద, గాడిదలమీద, పొట్టిగుర్రాలమీద, ఆఖరికి గుర్రపు పిల్లలమీద ఎక్కి స్వారీచేస్తూ కాలిబాటలపైనా, ఎద్దుబళ్ళపైనా, టాంగాలలోను మైలు తరువాత మైలు ఎక్కి దిగుతూ. తట్టుకొనేవారట.

రాత్రిలేదు, పగలులేదు. అనుకున్న మస్తును బాబా చెంతకు చేర్చే వరకు శిష్యులకు స్నానపానాదులు, భోజనాదికములు శూన్యం. మస్తులు ఏ పొదలమాటునో వుండి ఒకపట్టాన దొరికేవారు కారు. గ్రామాలలో పట్టణాలలోకూడా వారు మస్తు అని గ్రహించుటకు అవకాశం వుండేదికాదు.

ఒక మంచి మస్తు అంటే అరుదుగా లభించే అపురూప నగవంటి వాడు" అన్నారు బాబా.

మరి ప్రాథమికంగా ఎన్నో యిడుములకోర్చి 76, 000 మైళ్ళు ప్రయాణంచేసి దాదాపు 20, 000 పైగా మస్తులతో సమాగము జరిపారు. ఈ మస్తులు బాహ్యంగా పిచ్చివారివలె కనబడినప్పటికీ అంతర్గతంగా అట్టి పిచ్చి ఆధ్యాత్మికపరమైనది.

మెహెర్ బాబా వీరివిగురించి యిలా అన్నారు. "మామూలు పిచ్చివాడి మనస్సు, వస్తుప్రపంచంయొక్క సమస్యలపట్ల విరక్తిభావం కలిగి వుంటాడు. భౌతిక పరిస్థితులనుండి తప్పించుకు తిరగడానికి ప్రయత్నిస్తాడు. ఈ ప్రాపంచిక కష్టాలనుండి తప్పించుకోలేనివాడు మస్తు.

అయితే మస్తు తన శరీర అంగాంగముఅందు దైవముగురించే ఆలోచిస్తూ తన కష్టములను మరచిపోవును. తన భౌతిక శరీరచింతనలేనివాడు మస్తు. మనసు వుంటే మానవుడు, మనసు పోతే దేముడు అంటారు బాబా. "మస్తులలో మనసు పనిచేయదు. భగవంతునిపై వుండే ప్రేమ, ఆయనకోసమే పడే తపనలో మునిగివుండటంవలన, తమ వునికి, పరిసరములు, వారు ఆచరించే పనులు, యివేమీ వారికి పట్టవు" అని వివరించారు

యింకా మస్తులను ప్రేమించే విధానంగురించి చెబుతూ "మస్తులు నన్నెలా ప్రేమిస్తున్నారో వారికిమాత్రమే తెలుసు. నేనుమస్తుల కోసం ప్రేమిస్తున్నాను. వారుకూడా తెలిసో, తెలియకో నన్ను ప్రేమిస్తున్నారు" అని చెప్పారు.

యిలా మస్తు కార్యక్రమ సమయాలలో కేవలం మస్తుల వుద్ధరణే కాక బాబా వ్యాధిపీడితుల , దీర్ఘరోగులను, నిరాశానిస్పృహ చెందిన వారిని, సర్వమూ కోల్పోయినవారిని యిలా ఎందరెందరినో కలుసుకొనే వారు.

ఆ వార్త దావానలంలా గ్రామగ్రామాన పాకిపోయింది. దాంతో బాబా ఆశీర్వాదం పొందటానికి జనం తండోపతండాలుగా వచ్చేవారు. కేవలం దీనజనోద్ధరణ కాక, బాబా సర్వప్రాణులందూ, నోరులేనిజీవుల పైన కూడా తన అపారకరుణ ప్రసరింపచేసి, వాటికి వుత్తమగతులు ప్రసాదించిన సంఘటనలు కోకొల్లలు.

అలాంటి సంఘటనలలో జీన్ ఏడ్రియర్ ప్రత్యక్షంగా పొందిన అనుభవం గమనించండి. బాబా అమెరికా పర్యటనలో వున్నప్పుడు కొందరు పాశ్చాత్య స్త్రీప్రేమికులు వెంటరాగా మిర్టల్ బీచ్‌లో వాహ్యాళిగా బయలుదేరి, సమీపంలోని ఒక కొండ శిఖరాగ్రానికి చేరారు. అంతలో బాగా బక్కచిక్కిన శునకం ఒకటి కుంటుకుంటూ సమీప పొదలమాటునుండి బాబా బృందంవైపు వచ్చింది. దాని ముఖమంతా ఏదో వ్యాధితో బాగా తినివేయబడింది, చాలా వికృతంగా కనబడుతోంది.

ఒంటికన్నుతో స్త్రీలవైపు జాలిగా చూస్తోంది. దాని చూపు హృదయవిదారకంగావుంది.

కొంతమంది యువతులు ఆ వికృతరూపం చూడలేక చేతిరుమాలు అడ్డుపెట్టుకొని దృష్టి మరల్చుకున్నారు. అంతలో అనుకోకుండా బాబా దానిముందుకు వచ్చి వంగి, తన వామహస్తాన్ని చీమునెత్తురు స్రవిస్తున్న

ఆ శునకం ముఖంపై వుంచి నిమిరారు. అప్పుడా శునకం తన ముంగాళ్ళపై కూర్చొని తదేకదీక్షతో బాబావైపు చూస్తున్నది. తనపై వుంచిన ఆ హస్తం దివ్యాస్త్రంగా పనిచేసి, వ్యాధి నిర్మూలన జరిగినట్లా శునకపు చూపులు చెపుతున్నాయి.

ఒక దీర్ఘ నిశ్వాస వదిలినది. నీరసవదనం మారిపోయింది. అమితానందంతో బలం సంతరించుకొంది. మెల్లగా లేచి తోకాడిస్తూ, బాబాకు తన విధేయత ప్రకటించింది.

దైవమానవుని హస్త స్పర్శతో దాని వ్యాధి నిర్మూలించబడినది. సమూలంగా తుడిచివేయబడింది. అది ఆయన స్పర్శ ప్రభావము.

దీనజనోద్ధరణలోకూడ, ప్రత్యేకత వుండేది. అంటరానితనం, మత మౌఢ్యం వీటిని సమూలంగా పెకలించివేయడానికి బాబా ముందుగా తన శిష్యులతో పునాది వేశారు. కటిక దరిద్రులను, కుష్ఠురోగుల్ని వెతికి పిలిపించి, వారికి స్నానం స్వయంగానే చేయించేవారు. స్వహస్తాలతో తుడిపించేవారు. వారి పాదములు కడుగుట, వంగి నమస్కరించి, వారి పాదములపై తన శిరమునుంచుట, వారికి పైకము, వస్త్రములు యిచ్చుట, యివన్నీ అతి ముఖ్యమైనవి.

ఆ తరువాత అవసర సహాయము పొందదగిన మధ్యతరగతి కుటుంబీకులు, హఠాత్తుగా సంభవించిన భారీ ఆపదలరీత్యా, వరదలు, కరువు కాటకాలు మున్నగువాటివలన నష్టపడి, యితరులను "దేహి" అని చేయి చాచి యాచించుటకు బిడియపడే వ్యక్తులు, మెహెర్‌బాబానుండి స్వయంగా కానుకలందుకున్నారు.

బాబా ధనమునెన్నడూ తన చేతితో ముట్టుకునేవారు కాదు. అయితే, ఆర్థిక అవసరం వున్నవారిని ఆదుకొను సందర్భంలో వారికిచ్చే కానుక మాత్రం పైకంరూపంలో స్వయంగా యిచ్చేవారు. అలా ఆయన ఆదుకొనుటకు అర్థము, మన భాషలో వాడే ధర్మముకాదు. ఆ పైకంద్వారా

అట్టి గ్రహీతలకు తన ఆధ్యాత్మిక ఆశీర్వచనం అందినట్లు కాగలదు.

యీ విధంగా మెహెర్‌బాబా భారతదేశంలోనేకాక అమెరికా ఇంగ్లాండు, ఇరాన్, ఆస్ట్రేలియా, యిరోపా మున్నగు దేశాలు దాదాపు 13 సార్లు పర్యటించారు.

మానవులయొక్క ఆధ్యాత్మిక లాభంకోసం అవతార్ మెహెర్‌బాబా తరచుగా ఏకాంతవాసం చేసేవారు. బాబా చెప్పినట్లు, ఆయన కార్యక్రమాలన్నీ మనకేదో బోధించుటకుగానీ లేదా క్రొత్తమతాన్ని స్థాపించుటకు గానీకాక, మానవుని మేల్కొలిపి తనలోనేవున్న భగవంతుడయిన యదార్థ ఆత్మను సాక్షాత్కరించుకొనగల చైతన్యం కలిగించుటకు.

అందుకే బాబా "నేను బోధించుటకు రాలేదు. కాని మేల్కొలుపుటకు వచ్చియున్నాను" అని నొక్కి చెప్పారు. ఆయన తన అనుచరులకు పరిపూర్ణ శిక్షణ యిచ్చి వారు ఆధ్యాత్మిక విలువలతో ఏవిధంగా జీవించాలో బోధించారు.

ఆయన తరుచు ఏకాంతవాసం చేసినప్పటికీ తన జీవితకాలంలో కొన్ని నియమిత సమయములలో వందలు, వేలకొలది ప్రేమికులకు తమ దర్శనభాగ్యం పొందుటకు. ఆధ్యాత్మిక ఆశీర్వచనములు పొందుటకు అనుమతించేవారు.

విభిన్నమయిన యిట్టి కార్యక్రమాలతోపాటు బాబా పాశ్చాత్య ప్రపంచంలో అనేకదేశములు శిష్య సమేతంగా సందర్శించారు. ప్రథమ పాశ్చాత్య పర్యటన 1931లో జరిగితే, ఆఖరిది పదమూడవది అయిన పశ్చిమదేశ సందర్శన 1958లో జరిగింది.

ఆ పర్యటనలోనే ఆయన మరలా అమెరికా ఆస్ట్రేలియాలలో ప్రయాణం చేశారు. ఆయన అమెరికాకు ఆరుపర్యాయాలు వెళ్ళారు. ఆస్ట్రేలియా రెండుసార్లు వెళ్ళారు. వెళ్ళిన ప్రతిసారీ, సర్వమానవాళికి ఒకే దివ్య సందేశం యిచ్చేవారు.

"నేను మీకు బోధించుటకురాలేదు. నేను ఎట్టి ప్రచారము కోరుట లేదు. నేను మీ హృదయాలలో ప్రేమ అనే విత్తనము నాటుటకు వచ్చితిని. అందువలన మీరు మీ జీవితకాలంలో మాయాప్రభావంచేత, భిన్నత్వములో వున్నప్పటికీ, ప్రేమద్వారా మీలో ఏకత్వభావము యొక్క అనుభవము కలిగితీరును. యిది యీ సర్వజగత్తులోని అన్ని జాతులు, కులములు, మతములుకూడ లింగభేదం లేకుండా అనుభవించగలరు" అనేది ఆయన సందేశసారం.

మెహెర్‌బాబా అతి సామాన్య జీవితం గడిపారు. ఆయన వివాహం చేసుకోనలేదు. మితంగా భుజించేవారు. మితంగా నిద్రించేవారు. ఎక్కువకాలం ఏకాంతంగా గడిపేవారు. తరచుగా వుపవాసములుండేవారు. యీ ఉపవాసములు ఒక్కొక్కప్పుడు నెలలకొలదికూడ కొనసాగేవి. బాహ్యంగా ప్రదర్శించే త్యాగము బహుస్వల్ప విలువ మాత్రమే కలిగి వుంటుందని, అందువలన సర్వార్పణ సద్గురు కృపకు ప్రేరణ అని బాబా చెప్పేవారు దైవాన్ని చేరే మార్గంలో లెక్కకు వచ్చేవి, నిష్కపటము, యదార్ధమగు అంతరంగిక త్యాగము (సమర్పణ) అని బాబా చెప్పేవారు. అయితే బాబా తన సందేశాలను ప్రపంచం నలుమూలలా వెదజల్లుటకు ఎట్టి సంఘాన్ని స్థాపించలేదు. ఆయనకు స్వంత ఆస్థి అంటూ ఏమీలేదు.

పేదలకు, వ్యాధిగ్రస్తులకు ఆర్థిక సహాయం అందిచ్చునప్పుడు తప్ప ఎన్నడూ ఆయన ధనాన్ని ముట్టలేదు. కర్మకాండలన్నా క్రతువులన్నా ఆయన అయిష్టత ప్రకటించేవారు. ఏ కోరికాలేకుండా, ఏ విన్నపమూ లేకుండా, పరిశుద్ధమైన ప్రశంశ యదార్ధమగు ప్రార్ధన కాగలదని బాబా నొక్కిచెప్పారు.

ఆయనకు సంగీతమన్నా కీర్తనలన్నా అభిలాషమెండు. ప్రియతమునితో ప్రేమికుని ఎడబాటును గురించి ఆలపించే విరహగీతాలంటే మరీ యిష్టపడేవారు. ఆయనది అతిశ్రావ్యమైన కంఠము. చక్కని అహ్లాదం

కలిగించేరీతిలో గానం చేసేవారు. ఆయన దోకల వాయిస్తూవుంటే, శ్రీకృష్ణుడు మురళివాయిస్తూంటే గోపికలు తన్మయత్వం చెందినట్లు శ్రోతలకు అనుభూతి కలిగేది.

ఆయన ప్రతిఒక్కరితో ఎంతో కలిసిపోయి స్వేచ్ఛగా సంచరించేవారు. మనమెరిగిన ఏ శ్రేణికి చెందిన వారిలోనూ బాబా యిమిడిలేదు. మామూలు అనుభవములు ఆయన గురించి చెప్పలేవు.

బాబా చెప్పినట్లు, ఆయన కార్యక్రమము, మనకేదో బోధించుటకు గానీ, లేదా క్రొత్తమతాన్ని స్థాపించుటకుగానీ కాక, మానవాళిని మేల్కొలిపి, తమలోనే వున్న భగవంతుడైన యదార్థ ఆత్మను సాక్షాత్కారం చేసుకొనగల చైతన్యం కలిగించుటే ఆయన కార్యక్రమ ముఖ్య ఉద్దేశ్యం.

ఆయన తన అనుచరులను వారివారి మత నమ్మకములను, ఆచారాలను స్వేచ్ఛగా ఆచరించుటకు అనుమతినిచ్చారు. ఏదీక్షయివ్వలేదు. భోగమయ జీవితానికి అలవాటు పడునట్లు చేశారు. క్రమశిక్షణలేమీ ప్రతిపాదించలేదు. పూజలు, జపాలు, మంత్రాలు లేదా యోగాలువంటివేవీ నిర్దేశించలేదు. నిజమైన "యోగ" మంటే "నీవు పోవుట" అన్నారు బాబా. శిష్యుల ఆశా పరిపూర్తి కొరకు వారికి సర్వమూ సమకూర్చారు.

అయితే శిష్యులుమాత్రం ఎట్టి నియమ నిబంధనలూ విధించనప్పటికీ, అంతరంగ ప్రేరణద్వారా విశాల హృదయులై సర్వమానవ సోదర భావం అలవాటు చేసుకున్నారు. బాబా జీవితంలో ఆచరించి చూపే అనుభవములే వారికి శిలాశాసనములైనవి. ఆయన జీవిత సంఘటనలు వారికి కఠోర నియమాలై క్రమశిక్షణలో సుశిక్షితులుగా తయారు చేసినవి

మెహెర్ బాబా జీవితంలో అక్టోబరు 1949 నుండి ఫిబ్రవరి 1952 వరకూ జరిగిన కారక్రమమొక అత్యంత ప్రధానఘట్టముగా భాసిల్లినది. యిదే నవజీవనం.

యీ కాలంలో బాబా సంపూర్ణ బాహ్యపరిత్యాగం అనే జీవనం గడిపారు. ఈ జీవితం క్రొత్తదైనా జీవుడు పాతవాడే. నవజీవనంలో పాల్గొన్నవారందరికీ, వారి పాత జీవితపు శారీరక మానసిక యిష్టాభిప్రాయములన్నీ బాగా చలించి పోయినవి. ఆ తీవ్ర ప్రకంపనంలో మూలమై చెల్లాచెదరై పోయినది.

నవజీవనంలో పాల్గొన్నవారు, అసలు జీవితం, జీవించవలసిన ప్రయోజనం ప్రధానంగా నిరాశా, నిస్సహాయత నిష్కామములని గ్రహించ గలిగారు. వారిలో పేరుకున్న వ్యక్తిగత అలవాట్లు, ఆవేశకావేషాలు, ఆశలు, ఆసక్తులు, కోరికలు, వాంఛలు, వీటన్నిటివి, మెహెర్‌బాబా అత్యంత, సామర్ధ్యతతో నిర్మూలింప చేశారు. వీటన్నిటినీ సమూలంగా నశింపచేసి వాటినుండి విముక్తులను చేసి, వాటి రూపంలోవున్న అడ్డు గోడల్ని పడ గొట్టారు.

సాధారణంగా, మన ధర్మశాస్త్రాలు, పురాణాలు చదివినప్పుడు, విన్నప్పుడు, అవి మనలో శాశ్వతంగా హత్తుకుపోయి జీర్ణించుకొని పోవు టకు అనునిత్యం మన జీవితాలలో మనం చవిచూచే అనేక సంఘటనలతో ఉదాహరణ రూపంలో అన్వయించి, నిరూపణ చేయబడుట మనము గమ నించ వచ్చును.

అట్లాగే ఆధ్యాత్మిక వుపన్యాసములు చెప్పేవారుకూడ, తాము చెప్పే ఆధ్యాత్మిక బోధలతో నిత్యవ్యావహారిక వ్యాపకాలలో జరిగే సంఘటనలతో పొంతనచేసి పదేపదే చెప్పుట మనకు తెలుసును. యిది యీ రోజుల లోనేకాక, యుగయుగాలుగా అవతారుల వలన, సద్గురువులు వలన, జరుగు తున్న నిత్యసత్యాలు.

బాబా చెప్పారు. "అనాదిగా ఎన్నో బోధలుచేసి చేసీ, విసుగుచెంది వున్నాను. నేనీఅవతారములో క్రొత్త మతమును స్థాపించుటకుగానీ, క్రొత్త తరహా బోధలు చేయుటకుగానీ మానవుడిగా మీ మధ్యకురాలేదు.

మీరు దేనిని తెలుసుకొనవలయునని నేను కోరుచున్నానో దానినంతటినీ ఒక్క సారే మీరు అవగాహన చేసుకొనగలరని నేను భావించుటలేదు. యుగ యుగములుగా నేను అనేకమారులు మిమ్ములను మేలుకొలుపుచూ, మీ మనస్సులలో జ్ఞాన బీజమును నాటుచున్నాను. మీ శ్రద్ధా భక్తులనను సరించి, అది కాలక్రమేణా మొలకలెత్తి, మొక్కయై మహావృక్షముగా పెరిగి, శాఖోపశాఖలై మీరు పొందవలసిన జ్ఞానఫలాన్ని ప్రసాదించుచున్నది. యిదీ నా అవతార ప్రయోజనం.

# కృషిఫలం

మెహెర్ బాబా మనలో జ్ఞానబీజం నాటుటకు వచ్చానన్నారుగదా! దీనిని గురించిన వివరణ చెప్పమని యీరుచ్ని కొందరు ప్రేమికులు ప్రశ్నించారు. అందుకు యీరుచ్, బాబా బుద్ధుడుగా అవతరించినప్పుడు తన బిడ్డలలో విముక్తి భావం కలిగించుటకు ఎలా ప్రయత్నించారో ఒక కథ చెప్పాడు.

బుద్ధుడు భిక్షకవృత్తి చేస్తూ శిష్యులతో సంచరిస్తున్నాడు. యింటిం టికి తిరిగి భిక్షయాచించేవాడు. అలా యాచన చేసే సమయంలో ఒక రోజున ఆయన తన శిష్యబృందంతో ఒక సంపన్న రైతు యింటిముందాగి భిక్షను అర్థించాడు. యింటి ముందాగి భిక్షనర్థిస్తున్న బుద్ధునిచూసి యజ మాని బయటకువచ్చి ఆకలితో వున్న వారి ముఖాలు పరికించి చూచాడు. ముఖకవళికలు తేరిపారచూచి, బాగా ఆరోగ్యంగా వున్న వారు యాచక వృత్తి చేయనవసరం లేదని అనుకున్నాడు, కష్టించి, కృషిచేసి సంపాదిం చాలన్న భావం మనసులో మెదలినది.

"చూడండి! మీరంతా యిప్పుడు మా యింటికి భిక్షార్థులై వచ్చారు. మీకు తెలుసునోలేనోకానీ, యదార్థానికి నేను సంపన్న రైతుని. నా పొలా లన్నీ పుష్కలంగా పండినవి. నా గోదాములన్నీ ఫలసాయంతో నిండి వున్నవి.

మరి యీ పంట ధాన్యమంతా ఆకాశంనుండి లేదా స్వర్గంనుండివచ్చి పడిందనుకుంటున్నారేమో? నా గాదెలన్నీ ధాన్యంతో నింపాలంటే నేను ఎంత శ్రమపడాలో తెలుసునా? నేను గంటలతరబడి ఎంతో కృషి చేయాలి. పగలనకా, రాత్రనకా పంటను కాపాడుకుంటూ జాగ్రత్తపడి పక్వానికి వచ్చిన తరువాత మాసూలు చేసుకొని యింటికి చేరిస్తేగాని, గాదెలు నిండవు.

యింత శ్రమపడి సంపాదించి ఫలితాన్ని ఎవరయినా పారవేసుకుంటారా? దానధర్మాలుగా ఏ మూర్ఖుడు వృధా చేయడు. మీరుకూడా శరీరకష్టంపడి శ్రమించి, మీ జీవితావసరములకు సంపద సంపాదించుకొనుడు" అంటూ నీతిని బోధించినట్లు సలహాగా చెప్పాడు.

అప్పుడు బుద్ధుడు అతినమ్రతగా యిలా జవాబిచ్చాడు "అయ్యా! మీరు చెప్పినదంతా కటికసత్యం. ముమ్మాటికీ నిజం. ఎవరుకూడా ధాన్యాన్ని కానీ, సంపదనుకానీ, శ్రమపడకుండా, శారీరకకృషి లేకుండా కూడబెట్టలేరు మీరు నిజంగా న్యాయమే చెప్పారు. నేను మీతో ఏకీభవిస్తున్నాను. అయితే నేను చెప్పేదికూడా మీరు వినాలి. నా కథ చెబుతాను వినండి. నేను ఎంత కష్టపడి కృషిచేసానో మీరు ఎరుగరు. నా శ్రమనుగురించి విని తీరాలి. మీరేమో శారీరకంగా ఎంతో శ్రమపడి కృషీవలుడుగా కష్టపడతారు. మీరు మీ పొలాన్నంతటినీ ముందుగా దున్నుతారు. ఆ పిమ్మట విత్తనములు చల్లుతారు. అవి మొలకెత్తి పెరుగుట ఆరంభం కాగానే, కీటకబారినుండి తప్పించుటకు సశ్యరక్షణ చర్యలెన్నో తీసుకొని జాగ్రత్త పడతారు. పంట పండి తయారుకాగానే కోతకోసి, కుప్పవేసి నూర్చి అప్పుడు వచ్చే ధాన్యాన్ని యింటికి చేర్చెదరుగదా! కాలచక్రంలో యీ పనంతా పూర్తయి ధాన్యం మీ యింటికి చేరటకు కేవలం మీకు ఒక సంవత్సరముమాత్రమే పడుతుంది. లేదా అంతకంటే యింకా తక్కువ కాలమే పడుతుంది. అంత తక్కువకాలంలో మీ యింటికి చేరిన మీ

కృషిఫలం, నిన్ను భాగ్యవంతుడినిగావిస్తుంది. నీవొక సంపన్న రైతువగు చున్నావు. అయితే నేనో? నీకు తెలియదుకానీ, నేను నీకంటే చాలా అధికమగు శ్రమపడుతున్నాను. కేవలం నా రూపురేఖలుచూచి, మీరు నన్ను కష్టపడి పనిచేయక, తేలికగా సంపాదించాలనే సోమరినని అనుకుంటు న్నారు. నేనెంత శ్రమించినా కటిక పేదవానిగానే మిగులుతున్నాను. కారణమేమంటే, నేనుకూడా మీవలెనే విత్తుతున్నప్పటికీ దాని ఫలితం, మీ కృషిఫలంవలె సంవత్సరములోపే అందుటలేదు. నేను విత్తిన విత్తు, మొక్క ఫలం నేను చూడాలంటే కొన్ని యుగాల వ్యత్యాసం పడుతుంది. ఎన్నో అవతారముల అనంతరం మాత్రమే, ఫలితం తెలుస్తున్నది, నేను చేసే కృషి, మీరు చేసే కృషికంటే చాలా కష్టతరమైనది. కడు శ్రమతో కూడుకున్నది. నేనొక విత్తు విత్తినతరువాత దాని ఫలితం అనుభవించా లంటే చాలాకాలం నిరీక్షించాలి. ఆ విత్తనమును నేను పోషించాలి.

మరి, ఆ విత్తనం మొలకెత్తి, పెరిగి మహావృక్షమై ఫల, పుష్ప భరితమగుటకు కొన్ని యుగములు పట్టును. అప్పుడు అతి కష్టముమీద ఆ ఫలాన్ని నా గోదాములో నిలువచేయుదును. చూచితివా? మరి నీ శ్రమ యీ కాలచక్రంలో ఒక సంవత్సరంలోపుననే ఫలవంతమవుతుంటే, నా విషయంలో అట్లుగాక, నా శ్రమకు ఫలం కొన్ని జన్మలు లేదా అనేక యుగములకుగాని పరిపూర్ణం కానేరదు" అని చెప్పాడు.

అలా చెప్పిన బుద్ధుని పలుకులలో, ఆయన తన బిడ్డలను ఏ విధంగా చూచునో, తుదకు వారికేవిధంగా విముక్తి కలిగించునో సూచనప్రాయంగా నిగూఢమైవున్నది. అందుకే ఆయన మాటలు, కృషీవలునిహృదయంపై ముద్రవేసినవి. ఆయన ఒక మహామనిషి, సాక్షాత్తు దైవమే అనే భావం పెంచుకున్నాడు. ఆయన పాదములపై బడి, శరణు వేడుకున్నాడు. తన కుటుంబ సభ్యులతో సహా ఆ కృషీవలుడు ఆనాటినుంచి బుద్ధుని అను చరులయినారు.

మెహెర్‌బాబా చెప్పినట్లు సత్యముద్వారా వెలువడే పలుకులలో యదార్ధభావం కలిగి అర్ధవంతమవుతాయి. అయితే మానవులు అవే పలుకులను తమ యిచ్ఛ ప్రకారం పలికినప్పుడు, అవి అర్ధరహితమై నిరర్థక మగును.

ఈ అవతార కాలంలో, మౌనంగా మీలో ప్రేమబీజాన్ని నాటి, నా చేతులద్వారా మీలో నవచైతన్యాన్ని రేకెత్తించి జాగ్రదవస్థలో మిమ్మ లను మేల్కొలిపి, మీ గమ్యానికి చేర్చుటకు సంకల్పించితిని. అందు వలన మనస్ఫూర్తిగా మీరంతా నా పాదములవద్ద దూళిగా మారి నన్ను ప్రేమించండి. చిట్టచివరవరకు నా కొంగు జారవిడువక, గట్టిగా పట్టు కొనుడని" అభయమిచ్చారు.

దీనిబట్టి మనం గమనించదగిన విషయం ఏమంటే, సోదాహరణ రూప ప్రవచనాలు చేయక, కటిక నిజాల్ని ఆచరణరూపంలో బాబా తన శిష్యగణాన్ని వుపకరణాలుగా వాడుకొని, సర్వమానవాళికి, ఆచరించి చూపి తద్వారా మనని మేల్కొలుపు గావించి, యీ యుగావతారుడుగా మెహెర్ బాబా ప్రదాత అయినాడు.

# అనాసక్తి

బాబా యిచ్చిన దివ్యసందేశాలలో ప్రధానమయినది- "నిన్ను నిన్నుగా గుర్తించగలుగునట్లు చేయునది జ్ఞానం. యీ జ్ఞానం నీలో కలిగి నప్పుడు నీవు అనుకొనే నీకంటే, నేను నీకెంతో సమీపంగా వున్నట్లు నీకు గుర్తు చేయును. ప్రకృతిని చూచుటకు నీకు కన్నులున్నవి. వాటి సహాయంతో నీ పసరిరములను నీవు చూడగలవు. అయితే అట్టి కన్నులు బాహ్యంగావున్న సర్వము చూచుటకు కేవలం వుపకరణాలు మాత్రమే. వాటిని అవి స్వయంగా చూడలేవు. నీ కళ్ళను నీవు స్వయంగా చూడా

లంటే, నీముందు అద్దం వుంచుకొని ఆ అద్దంలోమాత్రమే చూడగలవు. అలాగే నీ అంతరాత్మ దానిని నీవు చూడగలగాలంటే, నీ ముందు జ్ఞానం అనే అద్దం వుంచుకోవాలి. అట్టి జ్ఞానమను అద్దాన్ని నేనివ్వగలను" అన్నారు బాబా.

మరి యిలాంటి జ్ఞాన సముపార్జనలో ముఖ్యంగా సాధకునికి మూఢ జగత్తు యొక్క వ్యాపకములందు అనాసక్తి, విరక్తి కలిగాలని బాబా ఈ సందర్భంలో తన ప్రవచనాలలో చక్కగా వివరించారు.

సాధారణంగా మనలో అనాసక్తి ఎప్పుడు కలుగుతుందంటే, అసాధారణ పరిస్థితులలో బలీయమగు అనుభవం ఎదురైనంతే, యీ జీవితమంటే విరక్తిభావం కలుగుతుంది. వుదాహరణకు మన సహచరులొకరు మరణించిరనుకొనుడు. ఆ శవాన్ని చూడగానే మనలో కలిగే విరక్తిభావం ఆ శవాన్ని స్మశానమునకు తీసుకువెళ్ళువరకు మనస్సు వికలమై చలించుచు ఆ అనుభవము, మనస్సులో పరిపరివిధముల ఆలోచనలను రేకెత్తించును. ఈ ప్రపంచంలో శాశ్వతమైనదేదీ లేదని. అంతా అశాశ్వితమని, ఈ జీవితం బుద్బుదప్రాయమనీ, అసలు ఈ జగత్తే మిథ్య అని, యిలా ఎన్నెన్నో వైరాగ్యభావాలు మనస్సునిండా ముసురుకుంటాయి. ఆ అనుభవముల ప్రభావముచేత, ఆ క్షణంలో తానుకూడా ఎప్పటికయినా మరణించవలసిన వాడినేనను భావం పుట్టును. ఎప్పటికయినా తను ఆత్మీయులుగా జీవిస్తున్న ఈ కుటుంబాన్ని అనుభవిస్తున్న భౌతిక సంపదనంతటినీ పరిత్యజించి వెళ్ళవలసినవాడినే అను సత్యం గుర్తుకువస్తుంది. అయితే యిప్పటి విరక్తిభావం అనాసక్తితో కూడిన ఆలోచనలు అతడి మనస్సులో ఎంతసేపు నిలువ వుండును? స్మశానంలో అంత్యక్రియలు పరిసమాప్తమగువరకు వుండును మరికొద్దిసేపటిలోనే ఈ ఆలోచనా అనుభవం మరుపుకు వచ్చును. తిరిగి భౌతిక బంధంలో చిక్కుకుపోవును. ఈ వ్యక్తే తన నిత్య జీవితం యధావిధిగా కొనసాగించును.

అంటే విరక్తిభావంవచ్చినప్పటికీ, మాయప్రభావంలో ప్రలోభపడి, భౌతికాకర్షణలకు లోనవుతున్నాడు. అందుకే యిట్టి తాత్కాలికవైరాగ్యాన్ని. స్మశాన వైరాగ్యం అంటారు. మనలో ఏ మార్పు రావాలన్నా ప్రధానసాధనం మనస్సు, అన్నిటికీ హేతువు మనస్సు. అందుకే బాబా తన కార్యక్రమమంతా మన మనస్సులపైనే కేంద్రీకృతం చేసి మనస్సు పరిభావితం చేయుటకు ఎన్నెన్నో అనుభవములు కలిపించారు.

ఈ విధంగా క్షణికమై గతించిపోయే విరక్తిభావం గురించిన మరో కథ బాబా ఈ సందర్భంలో తన ప్రవచనాలలో పేర్కొన్నారు.

ఒకప్పుడు ఒకవూళ్ళో గోపీచందా అనే గురువుకు సంబంధించిన ఆధ్యాత్మిక నాటకం ప్రదర్శించబడుతోంది. ఆ నాటకం చూచిన ఒక వ్యక్తి మనస్సుపై అది హత్తుకుపోయి అతడిని గాఢంగా పరిభావితుడ్ని చేసినది. దాని పరిభావంతో అతడికి జీవితమంటే విరక్తి పుట్టుకొచ్చినది. కుటుంబమంటే అనాసక్తి కలిగినది. ఫలితంగా ఆత్మీయులందరినీ పరిత్యజించి బైరాగుల సంఘంలో చేరాడు. ఈ సంఘం, గోపీ చందా సాంప్రదాయానికి చెందినదే. తన మామూలు వేషభాషలు మార్చివేశాడు. కాషాయ దుస్తులు వేసుకున్నాడు. బోడిగుండు చేయించుకున్నాడు. బృందంలోని తోటి సభ్యులు ఆధ్యాత్మిక సలహా లిస్తుంటే పాటిస్తున్నాడు. ముందుగా ధ్యానము చేయుట ప్రారంభించాడు. ఒక చెట్టుకింద ధ్యాన విష్టలో కూర్చున్నాడు.

ప్రొద్దు ఎక్కిన కొలది ఎండ తీక్షణత పెరుగుతున్నది. సూర్యరశ్మి అతనిపై పడుటచేత ఎండ తాకిడికి తట్టుకోలేకపోతున్నాడు. ధ్యానం చెడినది. మనస్సంతా ఎండను గురించిన ఆలోచనలతో ప్రారంభమై తక్కిన ప్రాపంచక జీవిత అనుభవాలతో నిండిపోయింది. క్రమంగా ఆకలిదప్పులు అధికమైనవి. యీ రకమగు భావాలతో అతని మనస్సు అల్లకల్లోలంగా తయారయినది, పరిస్థితి అతిదయనీయంగా మారినది,

ఆదే సమయంలో కుటుంబసభ్యులు అతడు ఎంతకూ యింటికి రానందున అతని గురించి ఆందోళనపడ్డారు. అతడి గురించి వూరంతా గాలించి, చివరకు ఒక చెట్టుక్రింద, అతిదయనీయమైన స్థితిలో బైరాగి రూపంతో కూర్చొనివున్న అతనిని కనుగొన్నారు.

ఆ సమయంలో అతడు అత్యంత చింతా క్రాంతుడై భయంకర పరిస్థితులతో చిక్కుకున్నవానిమాదిరి, అసౌక్యంగా కనిపించాడు. అట్టి విచిత్ర పరిస్థితులలో కనిపించిన అతనిని చూచిన భార్య దుఃఖాక్రాంతయై, విలపిస్తూ అతని దయనీయ స్థితినుండి ఆదుకొనుటకు పూనుకొన్నది.

అనునయపూర్వకంగా భర్తను చేరి, ప్రేమతో భర్తను యింటికి రమ్మనమని బ్రతిమలాడింది. ఒక్కరోజుకే అతడి నూతన జీవితంలో అలసిపోయినందున అతని మనస్సులో పాదుచేసుకున్న వైరాగ్యభావం భార్య వేడుకోలు వినగ మరుక్షణంలోనే నశించిపోయినది. ఆ క్షణంలో ఆమెరాక, అతడికి స్వర్గంనుండి వచ్చిన వరంవలె అగపించినది. నిశ్శబ్దంగా, మారుమాట్లాడకుండా వెంటనే లేచి నిలబడ్డాడు. కాషాయబట్టలు తీసివేశాడు. మామూలు దుస్తులు వేసుకున్నాడు. చెంతనున్న భార్యను యింటికి పదమని త్వరపెట్టి, ఆమెననుసరించి స్వగృహం చేరాడు. దీనిని బట్టి మనము గ్రహించవలసినదేమిటి? మనం కేవల తాత్కాలికమైన క్షణిక మగు అనాసక్తతకు ప్రలోభపడక శాశ్వత విరక్తిని (జ్ఞానం) బాబాకృపకు పాత్రులమై ఆయననుండి పొందకలగాలి.

# సమర్పణ

మెహెర్ బాబా హఫీజ్ సూక్తినొక దానిని వివరిస్తూ "నా ప్రియతముని ప్రేమించుటలో నేను ఏనుగు పాదముక్రింద ఒక చీమనై పోయితిని. నాకు తగు రక్షణ వున్నది. సురక్షితము, విశ్చింతవున్నవి. కానీ, కదలుటకు అశక్తత ఏటూ కదలుటకు వీలులేదు" అన్నారు. దీని భావం అర్ధమగు టకు ఎన్నో వుపమానములు బాబా చెప్పారు. యిది ప్రియతమునికి సమ

ర్పణ గురించి బోధిస్తున్నది.

బాబామెహెరాబాదు ఆశ్రమం నడుపుతున్న రోజులలో ఆయన దగ్గరకు ఒకతను వచ్చి తాను తన సర్వస్వాన్ని బాబాకు సమర్పణ కావించ దలచినట్లు చెప్పెనట. అందుకు బాబా, నీవు సమర్పించుకొనే సర్వస్వం యేమిటని ప్రశ్నించగా, నేనూ, నా భార్య, నా నలుగురు పిల్లలు యివేనా సర్వస్వం అన్నాడట.

అందుకే బాబా అంటారు, "యిటువంటి సమర్పణ, సమర్పణకాదు ఎట్టి బాహ్య ప్రదర్శన వలన భగవంతుడు మోసపోవు మూర్ఖుడు కాడు. పూజాపునస్కారములు, ప్రార్థనలు, చర్చి గంటలు మ్రోగించుట, మంత్రాలు జపాలు, మున్నగు చర్యలకు ఆయన చెవిటి వానివలె వుండును. భౌతిక పరమైన యిట్టి చర్యలను ఆయన అంగీకరించడు. యివి వట్టి తియ్యటి కబుర్లు వంటివి. వీటిలో ఆయన ఎన్నడూ చిక్కుకొనడు. ఆయనలో చలనం కలిగించేది కేవలం ప్రేమ. ప్రేమమాత్రమే ఆయనను జయించును. కనుక "నన్ను గాఢంగా ప్రేమించండి. నా కొంగు జార విడవక గట్టిగా పట్టుకొనండి" అంటూ బాబా చెప్పారు.

యీ కొంగు పట్టుకుంటే విలువ ఏమిటో యీరుచ్ పాశ్చాత్య ప్రేమికులకు చెప్పినప్పుడు, యీ క్రింది కథ వ్రాయబడినది. యీ కథ బాబాయే స్వయంగా శిష్యులతో చెప్పారట. ఇది ఒకరాజు, వుంగరం, ఆయన బానిసలకు సంబంధించిన కథ. అది ఒక అద్భుతమగు నీతి బోధకమైనకథ. దానిని బాబా అనేక పర్యాయములు చెప్పియున్నారట.

పూర్వం ఒకరాజున్నాడు, ఆధ్యాత్మికంగా అతడు చాల పురోగమించి వున్నాడు. ఆయనను మనము రాజర్షి అనవచ్చును. లేదా ఒక ముని అనో, గురువు అనో, పిలవవచ్చును ఆయన దగ్గర ఒక బానిస వున్నాడు. అతని పేరు అయజు. అయితే ఈ బానిస చాల వుత్కృష్ట మైన మనిషి. అతడు బానిసయే అయినప్పటికీ ఆధ్యాత్మికంగా అతడు

కూడా తన యజమానితో సరితూగ గలడు. అందుచేత ఇతడు తన యజమానికి అత్యంత సన్నిహితుడైనాడు.

రాజుకూడ, తన రాజ్యవ్యవహారములలో యితడి మాటనే తుది మాటగా తీసుకొనేవాడు. ముందుగా రాజు, సమస్య ఏదైనా వచ్చినప్పుడు తన మంత్రివర్గంతో చర్చించి వారి అభిప్రాయం చెప్పమని కోరేవాడు. అయితే తుది నిర్ణయం తీసుకోబోయేముందు బానిస సలహా తీసుకొనేవాడు. దీనికి మంత్రులంతా కుపితులయ్యేవారు. వారికి చాల బాధ కలిగేది.

రాజు నిర్ణయం తీసుకొనుటకుముందు, వారు తమ అభిప్రాయం చెప్పవలసి వస్తున్నది. అయినప్పటికీ తమ సలహాను కాతరు చేయక, రాజు ఒక బానిస యిచ్చే సలహా పాటిస్తూవుంటే మంత్రులకు చిన్నతనంగా వుంటున్నది. వారి బాధను బయటకు వ్యక్తీకరించలేక పోతున్నారు.

అయితే రాజు వారి భావాల్ని పసిగట్టాడు. వారికి తగు గుణపాఠం చెప్పాలని నిశ్చయించాడు.

ఒకరోజున రాజు నిండు సభలో తన రాజముద్రిక అయిన వుంగరాన్ని తన వ్రేలునుండితీసి, అందరికీ చూపించి, "ఈ రాజ్యముయొక్క అన్ని కార్యకలాపములు నెరవేర్చుటకు, అజ్ఞలు జారీచేయుటకు, ఆదేశములు చట్టములు అమలుపరచుటకు ఈ వుంగరం మొహరుగా వుపయోగ పడు చున్నది కదా! అది మీకందరకు తెలుసును అంటూ రాజు ఆ వుంగరాన్ని తన ముందున్న బల్లపై వుంచాడు. సభాసదుల్ని మంత్రిపుంగవుల్ని వుద్దేశించి, ఈ వుంగరం విలువ ఎంతో లెక్కకట్టి చెప్పండి" అని ప్రశ్నించాడు.

సభలో వున్న సభికులంతా వేళ్ళులెక్కించి, తలా ఒక విధంగా దానికి విలువకట్టారు. సభాసదులు, అమాత్యశేఖరులు, దాని వెల గురించి తమ తమ అభిప్రాయములు చెప్పారు.

ఆ తరువాత నగర వర్తకులను పిలిపించి వారిచేతకూడా దాని వెల నిర్ణయించమనెను. వీరుకూడా తలా ఒకరకపు విలువ చెప్పారు. వీరంతా ఆ వుంగరంలో వుపయోగించిన బంగారం, తక్కిన విలువగు వజ్రములకు లెక్కకట్టి వెల నిర్ణయించి చెప్పారు.

అప్పుడు రాజు ప్రక్కనే నిలబడివున్న బానిస అయాజువైపు తిరిగి ఆ వుంగరం విలువ ఎంతో చెప్పమన్నాడు. అందుకా బానిస రకీమని "ఆ వుంగరం ఈ బల్లపై వున్నంతవరకూ ఏమీ విలువలేదు. అయితే అదే వుంగరం నా ప్రభువు వ్రేలికి వున్నవెంటనే అది వెలలేనిది, అమూల్యమైనది అగుచున్నది" అన్నాడు.

యిలా ఈ కథ పూర్తయినతరువాత బాబా, శిష్యులతో అన్నారట "మీరు నా కొంగు పట్టుకొని వున్నంతవరకూ మీరు వెలకట్టలేని అమూల్యమగువారగుచున్నారు. ఎవరూ మీ విలువ ఎరుగకపోయినప్పటికీ మీరు మాత్రం అమూల్యమైనవారు కాగలరు. మరి మీరు నా కొంగును విడిచిపెట్టినచో ఆ మరుక్షణంలోనే మీరు ఎట్టి విలువలేని వారగుదురు. యీ ప్రపంచంలో మీరెంత గొప్పవారయినా, ఎంత గొప్పతనమున్నప్పటికీ, అవేవీ మిమ్ములను రాణింపచేయవు" అన్నారు.

# నవ జీవనం

భగవంతుడొక్కడే. అయితే ఆయన నామములు అనంతములు. ఆయన రూపాలు అనంతములు. హిందువులు ముక్కోటిదేవతలను ఆరాధిస్తారు. చీమ మొదలుకొని బ్రహ్మపర్యంతం ఆయనరూపాలే. యీ విశ్వంలో ఆయన లేకుండా రవ్వంతకూడ లేదు. "నావారశూకవత్తస్వేం పితాభాతశ్యణూపమా" అని వేదం చెపుతున్నది. చీపురుపుల్ల చివర నుండే అణురూపంలోకూడా నీ రూపం నిండివుందన్నభావం అద్వైతాన్ని బోధిస్తున్నదిగదా!

మనం తెలుగులో మామిడిపండు అంటాం. దీనినే సంస్కృతంలో చూతఫలం అంటారు. హిందీలో అయితే "ఆమ్" అంటారు. మరి ఇంగ్లీషులో "మ్యాంగో" అంటారు. చూడండి! ఒకే వస్తువుపేరు భాష మారేసరికి ఎన్ని రకాలుగా మారిందో! మరి భాష ఏదయినా ఫలము ఒక్కటేకదా! అలాగే పేర్లెన్నివున్నా భగవంతుడొక్కడే.

మరో వుదాహరణ చూద్దాం! పంచదార తీపి అని మనందరికి తెలుసును. పంచదారతో లడ్డూలు చేస్తారు. చిలకలు చేస్తారు. చేపలు గిన్నెలు, యింకా ఎన్నెన్నో ఆకారాల్లో ఒకే పంచదారతో చేయొచ్చును. మరి అవన్నీ రకరకాల ఆకారాల్లో వేర్వేరుగా కనబడినప్పటికి వాటన్నిటిలో వుండే రుచిమాత్రం పంచదారే! కనుక అవన్నీ తినుటకు తీపిగానే వుంటాయి. అయితే రుచి తెలియని చిన్నపిల్లలు అవన్నీ పంచదార వస్తువులే, అని తెలుసుకోలేక వారి కంటికి బాగా నచ్చినవాటినే తినగోరె దరు. అందంగా కనబడనివాటిని అసహ్యించుకుంటారు. అసలురహస్యం తెలుసుకొనగలిగినవారు ఏ వస్తువునయినా సంతోషంగా తింటారు.

అలాగే విశాల విశ్వంలోవున్న ప్రతి పదార్ధమందు భగవంతుడున్నా డని తెలుసుకొనగలిగినవారు అన్నిటినీ ప్రేమిస్తారు. యీ సత్యాన్ని సర్వ మానవాళికి ఎరుకపరచుటకొరకే భగవంతుడు, మాటిమాటికి మానవ రూపంలో అవతరిస్తాడు. మత విద్వేషాలు పేట్రేగి, ప్రపంచమంతా సంక్షోభంలో కొట్టుమిట్టాడుతున్న తరుణంలో మెహెర్‌బాబా "నేను మేల్కొలుపుటకేగాని, బోధించుటకు రాలేదు" అంటూ మానవాళికో దివ్య సందేశం యిచ్చారు. మనది పైన చెప్పినటువంటి చిన్నపిల్లల మన స్తత్వం. మంచి గురువు దొరికి, పాఠాలు నేర్చుకుంటేనేగానీ సత్యాన్ని తెలుసుకొనలేము.

మానవులంతా చిన్నపిల్లలవంటివారన్నారు బాబా. రుచి ఎరుగని పసివారు, రకరకాల ఆకారాల్లో పంచదార వస్తువులు ఎన్ని తయారయి

నప్పటికీ వారికి నచ్చినవాటినే యిష్టంగా తింటారు. అలాగే ఈ మానవులు కూడా అటువంటి పసి మన సత్వంతో, వేర్వేరు రూపాల్లోవున్న తమ మధ్య "నీవు-నేను" అనే భేదం ఆపాదించుకొని వారందరిలోనూ వున్నది ఆ ఏకైక సత్యం ఒక్కటే అని ఎరుగలేకున్నారు. అందుకే మానవు లందరికీ ఈ జగత్తు ఒక బాల్వాడి అన్నారు బాబా. పురోభివృద్ధి చెందిన సద్గురువులు వారికి విజ్ఞానపాఠాలు నేర్పాలి.

మనకు తెలియని యీ సత్యాన్ని మరో తెలిసినవ్యక్తి చెప్పినకానీ అసలు విషయం మనకు అవగాహనకు రాదు. చూడండి! మన పెరట్లో మనకు తెలియని ఏదో మొక్క పడి మొలచినదనుకొనుడు. దానిని మన మెన్నడూ చూచివుండనందున అదొక పిచ్చిమొక్క అనుకొని దానిని నరికి పారేయాలనుకుంటాము. అంతలో ఓ సాధువు భిక్షార్థియై వచ్చి స్నానం చేయుటకు నూతివద్దకు వెళతాడు. దొడ్లో మొలచిన పిచ్చిమొక్కను చూచి అమితాశ్చర్యంతో యజమానిని పిలిచి " నీవెంతటి అదృష్టవంతుడవయ్యా! నీ దొడ్లో తెల్ల యీశ్వరిమొక్క మొలచినది" అంటాడు. అప్పుడుగాని తాము పిచ్చిమొక్కని నరికివేయాలని అనుకున్నది-భయంకరసర్పాల విషపు కాటుకు దివ్యౌషధము అని తెలుసుకొనలేము. చూచారా! మరి అజ్ఞానంలో వున్న మనకు జ్ఞానోదయం కలగాలంటే, ఒక సద్గురువు సహాయం కావలసి వచ్చినది.

అయితే మనమా పరమాత్మ, యీ సమస్త చరాచరమునకు అంతరాత్మయై, సూర్యతేజస్సువలె, సర్వ జీవరాసులు తమతమ కార్యములొనరించుటకు సహజ ప్రేరణశక్తి కలిగియున్నట్లు గ్రహించలేకున్నాము. దీనినే బాబా యిలా చెప్పారు. భగవంతుని శక్తి, సమస్త చరాచరము లందు యెలా విక్షిప్తమైయున్నదనగా, కాష్టమునందు అగ్నివలె, పుష్పము లందు వాసనామకరందమువలె, రాతియందు లోహమువలె, నిగూఢముగా వ్యాపించియున్నది.

దీనికి యింకా దృష్టాంతరము కావలెనన్నచో, మన ప్రభుత్వము దాని పరిపాలన గమనింపుడు. ప్రభుత్వమనేది రూపరహితం. అయితే విశేష అధికారములతో, చట్టములతో, యెంతో శక్తివంతమై పరిపాలన చేయును. అట్లే భగవంతుడుకూడా మాయాశక్తి, కార్యరూప జగత్తు వలన తెలియబడుచున్నారు. కలెక్టరున్నాడు. అతనికున్న విశేషాధికారములు పరిపాలనకు వుపయోగపడును. కలెక్టరు కనబడుచున్నాడు. కానీ ఆయనకున్న అధికారశక్తి కనబడదు. శక్తిని విసర్జించినప్పుడు అనగా వుద్యోగ విరమణ చేసినప్పుడు అతడు మామూలు మనిషే, అట్లే ఆత్మ యొక్క శక్తి కనబడక తత్కార్యమగు జగత్తు మాత్రం కనబడుచున్నది.

ఇట్టి జగత్తునందు, మానవులమధ్య మానవుడుగా భగవంతుడు అవతరించినప్పుడు, ఆయన సమకాలికులకు, తనయందు అంతర్నిహితములైవున్న శక్తి జ్ఞానానందముల ప్రభావముల నెరుకపరచి, సమర్పణాభావము పెంపొందించును.

ఈ యుగంలో అవతార్ మెహెర్‌బాబా అన్ని మతాలకు, కులాలకు సంబంధించిన యెందరో శిష్యులను చేరదీసి, వారిని నిస్వార్థ సేవకులుగా తాను చేసే ఆధ్యాత్మిక కృషిలో తోడ్పడుటకు వుపకరణములుగా మలచుకున్నారు. ఆరంభంలో యెన్నో ఆశ్రమాలను, వేర్వేరుచోట్ల ఏర్పాటు చేసి, యెప్పటికప్పుడు వాటిని నిర్మూలించేవారు. భవన నిర్మాణానికి పరంజాలు యెలా అవసరమో, అలాగే సర్వమూ పరిత్యజించి, తానే సర్వస్వమని నమ్ముకొని బాబాను ఆశ్రయించేవారిని కఠోర నియమాలతో క్రమశిక్షణతో తీర్చిదిద్దుట అవసరమనేవారు బాబా.

బాబా శిష్యకోటిలో స్త్రీ పురుషులెందరో వున్నారు. వీరందరికీ బాబా భోగమయ వాతావరణం కలిపించారు. వారి ఆశాపరిపూర్తికొరకు వారికి సర్వ సుఖములు సమకూర్చారు. భోగమయ వస్తువులమధ్య, జీవిస్తున్నప్పుడే శిష్యులకు త్యాగబుద్ధి రావాలని ఆయన వాంఛ.

అయితే, శిష్యులు, కఠిన నియమాలతో క్రమశిక్షణకలవాటు పడ్డారు. బాబా ఎడల భక్తి, విశ్వాసాలు పెంపొందించుకున్నారు. కానీ, ఆయన ఆశించిన నిరాశామయ, నిస్సహాయ జీవనంమాత్రం వారికి అలవడలేదు. అందువలన, వారికి భోగమయ వాతావరణం వదిలించి సర్వసంగరాహిత్యం కలిగించాలని భావించారు. అతి కఠోరమగు తపశ్వి జీవనం సమకూర్చాలని సంకల్పించారు. మరి యిట్టి జీవనాన్ని ఒకేసారి తిన్నగా తన శిష్యులకు అలవాటు చేయాలని వుద్దేశించారు. "నిన్న గడచిపోయింది. అదిగడు చరితిలో, నేడుకూడా గడిచిపోయింది ఎలాగో మరి రేపు గురించి చింత ఎవరికి? రేపుకూడా గడిచిపోతుందిలే!" అనే నిరాశా, నిస్సహాయస్థితికి వారిని తీసుకురాబూనటమే యీ జీవనలక్ష్యం.

మరి బాబా యిప్పటివరకూ తాను దైవమానవునిగా, యీశ్వరావస్థానమందుండి అనగా అనంత శక్తిజ్ఞానానందపు ఎరుకతో విశ్వ కార్యక్రమం నెరపుతున్నందున, యీ క్రొత్త జీవనం సామాన్య మానవునిగా నెరపవలసి యున్నది. అందుచేతనే అట్టి సర్వోన్నత స్థానమువదలి సామాన్య మానవస్థానమునకు బాబా దిగివచ్చారు. అనంతశక్తి, అనంత జ్ఞానము, అనంత ఆనందములు కలిగినవాడు భగవంతుడు అన్నారు బాబా. అయితే అవతారుడుగా, మానవుడై అవతరించినప్పుడు అనంత శక్తి, అనంత జ్ఞానములు, అనంత ఆనందములు కలిగివున్నప్పటికీ, అనంత శక్తి అనంత జ్ఞానములు మాత్రము వుపయోగిస్తూ, అనంత ఆనందముపై ఒక తెరవేసి యుంచునని బాబా చెప్పారు. యీ విధంగా భగవదవస్థానము నుండి మానవాస్థానమునకు దిగివచ్చి, సాధారణ మానవలీల నెరపుతూ తన శిష్యులతో బాబా గడిపిన జీవనమే నవజీవనం అన్నారు.

మెహెర్‌బాబా జీవితంలో అత్యంత ప్రధానఘట్టం యీ నవజీవనం ఈ జీవితం సరిక్రొత్తదయినప్పటికీ అనుభవించిన జీవుడుమాత్రం పాతవాడే. యిట్టి నవజీవనంలో పాల్గొన్న శిష్యులందరికీ, వారి పాత జీవితపు

శారీరక, మానశిక, యిష్టాభిప్రాయాలన్నీ చలించిపోయినవి. యిది శరీర ములకంటే మనస్సుకు పెద్దపరీక్ష అయినది. బాబా 1949లో 40రోజుల పాటు బ్లూ బస్సులో ఏకాంతవాసం గడిపినతరువాత మండలినందరినీ సమావేశపరచి, అత్యంత ప్రాముఖ్యం గల ప్రకటన ఒకటి యీ విధంగా చేశారు.

"నేనిప్పుడు ఒక ప్రణాళికను తయారుచేశాను. దానిని నెరవేర్చుటకు, నాతో సహకరించేందుకు మీలో సిద్ధముగా వున్నవారందరూ నన్ను అనుసరించవచ్చును" అని ప్రకటించారు.

యింకా ఆ ప్రణాళిక గురించి వివరిస్తూ బాబా "యిప్పటికి షుమారు 28 సంవత్సరములనుండి మీరంతా నా దగ్గరవుండి సకల భోగములు అనుభవించారు. కానీ, నేనికనుండి నిరాశ్రయుడనై త్యాగమయ జీవనం గడుపదలచాను కావున మన ఆశ్రమమునకు సంబంధించిన యావదాస్థులు విక్రయించి పేదసాదలకు పంచిపెట్టి, పరివ్రాజక జీవనం గడుపదలచితిని. మరి నేను అనుభవించదలచిన జీవనం కంటకభూయిష్టమై దుస్సాధ్యముగా వుండును. అందుచేత యికపై మీరు నాతో వుండుటకు యిష్టపడితిరేని, మీరుకూడా నావలెనే సర్వసంగపరిత్యాగం చేసి పరివ్రాజకులు కావలయును మైళ్ళకొలది కాలినడకన పయనించవలసివచ్చును. ఆరుబయట కటిక నేలపై పరుండవలసి రావచ్చును. సన్యాసులవలె కౌపీన ధారణచేసి భిక్షాటన చేయవలయును. మీరు తెచ్చే భిక్షాన్నము ముందుగా నాకు సమర్పించి అది మరల మీకు నా చేతులతో పెట్టినప్పుడే మీరు భుజించవలయును. ఏ కారణము చేతనైనా నా చేతులు స్వాధీనము తప్పి ఆ భిక్షాన్నము మీకు పెట్టజాలకపోయినచో మీరు కేవలం జలము మాత్రమే త్రాగి జీవించవలయును. ఒకవేళ మీరు రోగగ్రస్థులైతే నా అనుమతిలేనిదే వైద్యుని సహాయము కోరుటగానీ, రోగనివారణ ప్రయత్నం చేయుటగానీ చేయరాదు, మీరు యితరులచే గౌరవింపబడుటగానీ, మన్ననలు

పొందుటదానీ, చేయరాదు. నేను మిమ్ములను నాపై వుమియమన్నా, కాలితో తన్నమన్నా ఆలా చేయుటకు వెనుకాడరాదు. మరి మీ పాదము లపై నేను వ్రాలి, నమస్కరించదలచినప్పుడు, మీరు ఎట్టి జంకూగొంకూ లేక, అలాగే విలబడాలి. మీరు మీ యోగక్షేమములగురించిగానీ, యిత రుల యోగక్షేమములుగానీ, ఆలోచించరాదు. ప్రపంచమునకు మీరు నిస్సహాయులుగాను, మృతప్రాయులుగాను వ్యవహరించాలి. నాయందు సంపూర్ణ విశ్వాసము కలిగి, నా ఆజ్ఞలయందు ఎట్టి విమర్శకు తావీయక వాటివి ఎల్లప్పుడు పాటించాలి. మరి యిట్టి నియమాలన్నీ పాటిస్తూ నన్ను అనుసరించువారు ఎవ్వరో తమ అంగీకారము తెలుపమని" బాబా ప్రకటించారు. దాదాపు 1200మంది సర్వార్పణ బుద్ధితో ఆయన వెంట వుండుటకు సంసిద్ధులైనారు.

అయితే బాబా యీ పన్నెండువందల మందిలో బహుకొద్దిమంది కేవలం ఇరువది ఆరుగురునిమాత్రం, కడువాకచక్యంతో, వారి మనస్సు లకు ఎట్టి బాధ కలుగనీయక, తనతో అనుసరించుటకు ఎన్నుకున్నారు. ఆ 26మందిలో 22 పురుషులు, 4 స్త్రీలు. వీరిలో 25 సం॥లనుండి 60 సం॥ మించినవారున్నారు. ఆశ్రమంలో విలువైన సామగ్రినంతా వేలంలో అమ్మివేసి నవజీవనంలో బాబాను అనుసరించక పూర్వజీవనంలోనే వుండిపో దలచిన వారందరి మనుగడకు ఆ పైకం వుపయోగించారు. ఆ తరువాత బాబా తాను ఎన్నుకున్న 26 శిష్యులతో 1949 అక్టోబరు 16వ తేదీన నవ జీవనం ప్రారంభించారు. ఈ జీవనంలో జరిగిన కష్టములు, బాధలు, నిస్సహాయ నిరాశామయ, జీవనం అలవడుటకు తానే స్వయంగా సృష్టించు కున్న ఘటన సర్వమూ పరిత్యజించి భగవంతునికి సర్వార్పణ గావించు కొని, ఆయన సహాయముపై ఆధారపడి తన శిష్యులంతా వుండాలని కోరి అట్టి జీవితము వారికలవాటు పడుటకు తానే నిరాశా, నిస్సహాయ జీవితము గడిపారు. నవజీవనకాలంలో బాబా అవతారుడుగాకాక, ఒక ఆధ్యాత్మిక

గురువుపంథాలో నడిచారు.

కేవలం ఒక మిత్రునిగా వ్యవహరించారు. అయినప్పటికీ తనతో వున్న మిత్రబృందానికి ఏకైక నాయకుడుగా ఆదుపుచేస్తూ దయాదాక్షిణ్యాలు గల సఖునిగా వ్యవహరించారు.

అది పాత జీవితంగానీ, క్రొత్తజీవితంగానీ, ఏ జీవితమయినప్పటికీ శిష్యులుమాత్రం ఆయనను కేవలం అనుసరించారు. ఆయన ప్రక్కనే వుండి ఏమి చేయమంటే అది చేసేవారు. ఈ క్రొత్తజీవితంలో సంచార జీవితం గడుపుతూ మాధూకరంతో ఆహారాన్వేషణ చేయించారు. బెనారస్‌లో ప్రథమంగా బాబాయే స్వయంగా మాధూకరవృత్తి ప్రారంభించారు శిష్యులంతా నవజీవనకాలంలో బాబాను ప్రభువుగా, దైవంగా ఆశించక తోటి మిత్రులతో ముఖ్య సఖుడుగా భావించారు, ఎట్టి కోరికలు లేవు. ఎట్టి బహుమానాలు ఆశించలేదు. ఆధ్యాత్మికపరమైన లేదా భౌతికపరమైన ప్రతిఫలమేదీ ఆశించలేదు.

అయితే బాబాయొక్క పాతజీవితంలో శిష్యులంతా ఆయనను దైవ మానవునిగా శిరసావహించారు. ఇప్పుడు నవజీవనకాలంలో సఖ్యునిగా భావించారు. మరి నవజీవనకాలంలో అయనను దైవమానవునిగా వదలి వేసినట్లేనా? లేదు. యిదో క్రొత్తతరహా జీవనం. ఆయనను శిష్యులంతా హృదయగహ్వరంలో నిలుపుకోవాలి. అంతరంగంలో దైవమానవునిగా ఆయనయందు యెనలేని నమ్మకం, విశ్వాసం, ప్రేమ ఇవన్నీ వుండాలి. అయితే బాహ్యంగా ఆయన శిష్యులకు ఒక సఖ్యునిగామాత్రమే కనబడేవారు.

మరి ఈ నవజీవనం గడిపిన రోజులలో వుండే వాతావరణం, శీతోష్ణస్థితులగురించి ఏమని చెప్పను? ఏమి ఆశ్చర్యం! అది భయంకర వాతావరణం. గడగడలాడించే చలి. భగ్గున మండే ఎండలు. కుండపోతగా వర్షం. ఎట్టి వాతావరణంలోనైనా శిష్యులంతా ఆరుబయట

గడపవలసిందే. ఎట్టి అచ్ఛాదనాలేవి రోడ్లప్రక్క విశ్రమించేవారు. వుత్తర భారతంలో నిరంతరం మంచు కురుస్తూ అతిశీతలంగా వుండే రోజులవి. అయినా శిష్యులంతా బాబాను అంటిపెట్టుకొని అనుసరించారు కనుక అదే వారికి రక్షణ అయింది. ఆయనే రక్షకుడైనాడు.

బాబా శిష్యులలో కేవలం ఆయన చెప్పినదిమాత్రం చేస్తూ ఆయనను అనుసరించేవారు మాత్రమేకాక, మానసికమైన కోర్కెలతో వుండే కొందరు లేకపోలేదు. కొందరు ఆయనద్వారా భగవత్సాక్షాత్కారం పొందాలనే తలంపుతో వుండేవారు. కొందరాయనను అనుసరిస్తే, యీ ప్రాపంచక యీతి బాధలనుండి తప్పించుకోవచ్చని తలచారు. యిలాంటివారు బహు స్వల్పమే. అయితే ఆయనను అనుసరించినవారుమాత్రం ఆయనను అనుసరించాలనేకానీ, ఎట్టి ప్రతిఫలితాన్ని ఆశించలేదు. ఈయన జీవనంయొక్క లక్ష్యం అన్ని ఆశలు, కోరికలను అధిగమించుట. తత్ఫలితంగా తమ జీవితంలో, ఆనందంగా గడుపుతూ, విలక్షణమయిన రీతిలో నిలువ గలుగుట.

బాబా ఒక చిన్న సత్యాన్ని ఎప్పుడూ చెపుతూవుండేవారు. "ఎంతో సహజంగా జీవించండి" అని బాబాతో శిష్యులు గడిపిన నవజీవనం నిష్కపటానికి పరిణామం. నిశ్చలత్వం, దయ, కరుణ, ప్రేమలకు ప్రేరణ, మోసానికి, అహంకారానికి ఆ జీవనంలో చోటులేదు.

బాబా ఈ జీవనంగూర్చి చెబుతూ "నవజీవనం అంటే ప్రాపంచక వ్యవహారాలు, నిజజీవితపు విధ్యుక్తధర్మాలు విడనాడి బాధ్యతలు విస్మరించుటగాదు" అన్నారు. ఆది ఒక క్రమశిక్షణతో కూడిన జీవనం. ముఖ్యంగా యీ జీవనకాలంలో శిష్యుల మనస్సుకు, హృదయానికి అగ్ని పరీక్ష. మనస్సులో సంక్షోభం రేకెత్తించి, హృదయానికి మనస్సుకు పోటీపెట్టి, చివరకు పశ్చాత్తాపంతో మనస్సు చలించిపోవునట్లు చేయుట అనేక సంఘటనలద్వారా ఋజువుపరచబడినది. నవజీవన సమయంలో

శిష్యులు తమ ఆరోగ్యంగురించే కాక, బాహ్యరూపాన్ని గురించి కూడా నిర్లక్ష్యంగా వుండేవారు. పెరిగిన గడ్డాలు, మాసిన దుస్తులు, మడ్డి ముఖాలతో తైలసంస్కారంలేని చెదరిన జుట్టుతో అసహ్యంగా రౌడీలవలె కనబడ్డేవారు. వీరి వాలకంచూచి, పోలీసులు అనుమానించిన సందర్భాలు కూడా వుండ్డేవి.

భిక్షకవృత్తిలో రోజుకు యిద్దరేసిచొప్పున యాచనార్థులుగా పంపబడే వారు. శిష్యులు అధిక బలాఢ్యులై ఆరోగ్యంతో వుండుటవలన, యాచన సమయాల్లో తిరస్కరించబడినప్పుడు వారి మనస్సులో చెలరేగే ఆలోచనలు వర్ణనాతీతం. అయితే బాబాయొక్క అంతరంగిక ప్రేరణద్వారా బాబా ఆజ్ఞలను వారు ఏవిధంగా పాటించారో, ఎటువంటి ఫలితాన్ని అనుభ వించారో వివరంగా రెండవభాగంలో చర్చించాను. యిక్కడ భిక్షాటన విషయంలో మనమొక ముఖ్యవిషయాన్ని గమనించాలి. అది ఒక ధర్మ సూక్ష్మం. విధులకు విధియైన అవతారుడు భిక్షాటన చేయుటకు ఎందుకు ఎంచుకున్నాడు? అసలు బిక్షకోరేవాడు, తనకన్నా అధికులైన సంపన్నునే అర్థిస్తాడు. బాబాచే భిక్ష అర్థించబడినవారుకూడా అంతటి సంపన్నులై యుండాలిగదా!

యిందు మరికొంత లోతుగా ఆలోచిస్తే బాబా శిష్యులు యాచించిన అధిక సంఖ్యాకులు, కటిక పేదవారు, కూలీనాలీ చేసి జీవించే కృషీవలులు. దీనినిబట్టి మనకు అవగతమగుచున్నది ఏమంటే. యిక్కడ వీరు ఆర్థిక సంపదలకుకాక, ఆధ్యాత్మిక ఔన్నత్యానికి ప్రాధాన్యత యిచ్చినట్లు బోధపడు తుంది. అతడు పేదకూలీయే! అయినప్పటికీ కటిక దరిద్రంలో, పూరి గుడిసెలోనే వున్నప్పటికీ శిష్యులు యాచన చేయగానే, బాబాయొక్క కృప వారిపై వుండి, అంతర్గత ప్రేరణకలిగి, వారి కుటుంబానికి ఆరోజుకంతటికీ సరిపడ వండివుంచుకున్న ఆహారాన్ని నలుసంతకూడా మిగల్చుకొనకుండా భిక్షగా పెట్టిన సంఘటనలు కోకొల్లలు. అనాడు వారింట్లో తమకేమీ తిను

టకు లేక అలమటిస్తున్న కుటుంబము లేదని చెప్పలేక ప్రక్క-యిళ్ళకు వెళ్ళి తామే స్వయంగా యాచించి తెచ్చి భిక్షపెట్టిన సంఘటనలుకూడా అనేకం వున్నవి వీటి వివరాలన్నీ మీకు రెండవభాగంలో వివరిస్తాను.

అందుకే బాబా యీ నవజీవనాన్ని ఎందుకు ఎన్నుకున్నారో తెలుసుకోవాలి. శిష్యులలో తానాశించిన అహంకార రహిత లక్షణాలు ఎంతటి కఠిన క్రమశిక్షలలో పెట్టినా అలవడనందున వారిలో దాగివున్న ఆ అహంకారాన్ని నాశనం చేయుటకే నవజీవనం ఎంచుకున్నారు. వుద్భృతమైన ఈ నవజీవనం 19.2లో పరిసమాప్తమైంది.

# చరమాంకం

1950-60 మధ్య దశాబ్దంలో బాబా ఎన్నో సామూహిక దర్శనాలు యిచ్చారు. లక్షలాదిమంది ప్రేమికులు, ఆయన దర్శనభాగ్యం పొందారు. ఈ కాలంలోనే అతిప్రాముఖ్యమైన బాబా గ్రంథాలనేకం ప్రకటించబడినవి. ముఖ్యంగా 1952లో ఒకసారి అమెరికాలో, 1956లో పూనా సమీపంలో రెండోసారి బాబా పయనిస్తున్న కారు తలక్రిందులై రోడ్డుప్రమాదాలు సంభవించుట, బాబాకు బలమైన గాయాలుతగులుట సంభవించింది.

అంతకుముందే యెన్నో సంవత్సరాలముందు బాబా తనకు జరుగనున్న ప్రమాదాలగురించి జోశ్యం చెప్పారు. "శారీరకంగా తనకు స్వయం కల్పిత ప్రమాదముగా సంభవించనున్నవి. అందునా అది ముందుగా అమెరికాలోనే జరగాలని దైవసంకల్పం" అన్నారు.

బాబా చెప్పినట్లే 1952లో కారుప్రమాదం జరిగింది. ఆ సంవత్సరంలో మిర్టిల్‌బీచ్‌లో తన కార్యక్రమాలు నడుపుటకై ఒక ఆధ్యాత్మిక కేంద్రాన్ని స్థాపించుటకు అమెరికా వెళ్ళి పెద్దఎత్తున పర్యటన జరిపారు. సౌత్ కరోలినాలోని మిర్టిల్‌బీచ్‌లో కార్యక్రమాలు పూర్తయినాయి. తరు

వాత కొన్ని వారాలపాటు కాలిఫోర్నియాలో మోటార్‌కారుపై పర్యటించారు. ఆ తరువాత ఓక్లహామాలోని ప్రేగ్‌వద్ద బాబా పయనించే కారు మరో కారుతో ఢీకొని ఘోరప్రమాదం సంభవించింది. బాబా యెడమకాలూ, యెడమచేయి విరిగినాయి. అయినప్పటికీ ఆ బాధలను సావధానంగా భరించారు. ఏమాత్రం వ్యధను వ్యక్తీకరించలేదు, "వ్యధపడకుడు-ఆనందంతో వుండుడు" అనే బాబా సూక్తిని అక్షరాల ఆచరించి చూపారు.

1952లో పూనా సమీపంలో రెండవపర్యాయం రోడ్డుప్రమాదం జరిగింది. యీరూచ్ కారు నడుపుతున్నాడు డా॥నీలు, పెండూ విష్ణూలు కారులో వున్నారు. డా॥నీలు నవజీవనకాలంలో బాబాను ఒక కోరిక కోరాడట బాబా ఆజ్ఞమేరకు. "తన తుదిశ్వాస బాబా సమక్షంలో వదిలే అవకాశం కల్పించమని" కోరాడట. అందుకే డా॥ నీలూ యీ కారుప్రమాదంలో బాబా సమక్షంలో తన తుదిశ్వాసను విడిచాడు. బాబాకు యీ రెండవ ప్రమాదంలో కుడికాలు, కుడిచేయి విరిగిపోయినవి. యీ దశాబ్దంలో జరిగిన రెండు ప్రమాదాలలో బాబా శారీరకంగా కుడిభాగాన, ఎడమ భాగానకూడా ప్రమాదకర దెబ్బలు తగిలి బాధలను అధికంగా అనుభవించారు.

శారీరక బాధలను అనుభవించుట గురించి ఒకసారి ప్రమాదానికి ముందే యిలా చెప్పారు "మనమంతా కొద్దిరోజులలో మరణించవచ్చును" అంటూ నీలూవైపు తిరిగి "దేవిగురించి వ్యధపడకుము. నన్నుగురించి విడువక జ్ఞాపకం వుంచుకొనుము. వున్న ఏకైక సత్యాన్ని నేనే" అని చెప్పారు. ప్రమాదం జరిగిన తర్వాత నీలూను చికిత్సకై ఆస్పటల్‌కు తీసుకువెళుతుంటే దారిలోనే మరణించాడు. అప్పుడు "నీలూకు తన కోర్కె ప్రకారమే యిప్పుడు మరణం సంభవించింది. ఆతడు నాతో వుండిపోవునట్లు ఆశీర్వదించబడ్డాడు" అన్నారు.

రోజురోజుకీ ఆయన శారీరక బాధలు అధికముకాజొచ్చినవి. ఆరోగ్యం బాగా క్షీణించింది. అంత వ్యధలోనూ బాబా భౌతిక శరీరం భారాన్నంతా భరించగలిగింది. అంతటి బాధలతోనూ బాబా మిర్జిల్ బీచ్ కేంద్రంలో సాహవాస్ నడిపారు. ఆ సాహవాస్‌లో పాల్గొన్నవారితో, తన స్వయంకల్పిత శారీరక బాధలు బాగాఅర్ధంచేసుకొనుటకు ప్రయత్నించమని, మానవాళియెడల తనకున్న ప్రగాఢప్రేమ, అపార కరుణలను తెలుసుకొనమని ప్రబోధించారు. నాకు జరిగిన రెండు కారు ప్రమాదాలలోనూ, నేనే వైద్యుని సలహా పొందలేదు. ఏ వైద్య సహాయం తీసుకోలేదు. ఏ వైద్యుడు, వైద్య విధానంకూడా నా వ్యధలను తగ్గించలేవని నాకు తెలుసును. యిదంతా విశ్వాత్మక వ్యధకానీ నా వ్యక్తిగత వ్యధ కాదు. యీనాటి యీ సాహవాస్‌లో నా సమక్షంలో వుండగలిగిన మీరంతా అదృష్టవంతులగు మిత్రులు. సాక్షాత్తు ఆసనాతనుడు, ఇప్పుడు యీ మానవాకారంలో మీ స్థాయిలో మీముందు వున్నాడు"

అంతకుముందు ఒకరోజు బాబా, ప్రేమికులతో కలసి ముచ్చటిస్తూ వారిని సూటిగా ప్రశ్నించారు- తానవతారుడుగా వారికి పరిపూర్ణమైన విశ్వాసం వున్నదా? అనేది బాబా ప్రశ్న. అందుకు అయన చుట్టూ పరివేష్టించివున్న అనుచర ప్రేమికులు నిరుత్తరులై తదేకంగా చూస్తూండిపోయారు. అప్పుడు బాబా వారితో తనను అట్టి దివ్య సనాతనునిగా అంగీకరించమని, మరి అట్టి అంగీకారానికి విధేయత అత్యంతావశ్యకమని చెప్పారు.

"నేను కోరునదెల్లా ప్రేమ, విధేయత! ప్రవచనములు, సందేశములు మంచివే కానీ అవి కేవలం మాటలు. ఆధ్యాత్మిక మార్గంలో అంగీకారానికి తావులేదు. నాకు విధేయులు కానివారెవరో చేతులెత్తండి!" అన్నారు. ఒక్కరుకూడా చేతినెత్తలేదు "అయితే నాకు విధేయులగుటకు ప్రయత్నించదలచేవారెవరో యిప్పుడు చేతులెత్తుడు" అనేసరికి

అందరూ చేతులెత్తారు.

అప్పుడు బాబా యిలా ప్రకటించారు. "నాకు విధేయులగుట చాలా కష్టం. నేను సాధువును కాను. నేనుసనాతునను. నేను సమయమాసన్న మైందని మీకు చెప్పుచున్నాను. నేనీ శరీరము త్యజించినప్పుడు నన్ను ప్రేమించువారందరిలోనూ వుండిపోదును. నాకు మరణమనేది లేదు. నన్ను ప్రేమించండి నాకు విధేయులుగా వుండండి. అప్పుడే మీరు నన్ను చూడగలరు. నూరుశాతం విధేయులుగా వుండుట అశక్యం. అయితే మీరు నూరుశాత ప్రేమ నాయందు కలిగి, నన్ను అవతరించిన ఆ సనాతనునిగా మీరు నూరుశాతం విశ్వాసం కలిగివుంటే నూరుశాతం విధేయులుగా వుండగలరు. కనుక యిప్పుడు చేతులెత్తిన మీరంతా నా యిచ్ఛను పాలించవలసియున్నారు" అని!

హాఫీజ్ సూక్తినొకదానిని వివరిస్తూ "ఒక్క క్షణం సద్గురువు సమక్షంలో పరిపూర్ణ విధేయతతో గడిపితే, హృదయపూర్వకంగా వంద సంవత్సరాలు దైవాన్ని ఆరాధిస్తూ ప్రార్థించినదానితో సమానం" అంటూ తన సమక్షంలో యీ సాహవాస్‌లో పాల్గొన్నవారందరూ ఎంతో అదృష్ట వంతులు అన్నారు.

"నేను ప్రేమ మహాసాగరుడను. మీకు అవకాశం వున్నంతలో ఎంత తీసుకోగలిగితే అంత తోడుకొనండి. అతిదుర్లభమగు ఈ అవకాశాన్ని సద్వినియోగపర్చుకోండి. భార్యాభర్తలు ఒండొరులు యెలా ప్రేమించుకోవాలో చెప్పుకుంటారా? అలాగే, మీరు నన్నెలా ప్రేమించాలో చెప్పవలసిన అవసరం నాకు లేదు. మీరే ఎంత ప్రేమించగలిగితే అంత ప్రేమ నానుండి పొందగలుగుతారు. నేను నా ప్రేమను మీకు ఇవ్వదలిచాను. అది పొందే అవకాశం మీలో ప్రతిఒక్కరిమీద ఆధార పడివుంది"

ఈనాటి ఆధునిక మానవుడు ప్రతివిషయం తన మేధాసంపదతో

తర్కించి తెలుసుకొన ప్రయత్నిస్తున్నాడు. ఈ తత్వాన్ని ఖండిస్తూ బాబా తను గడిపే "సహవాస్" యిలాంటి తర్కమీమాంశకు, చర్చలకు ఏర్పాటుచేసిన చర్చావేదిక కాదన్నారు. సహవాస్ అంటే "ప్రియతముడు ప్రేమికులమధ్య సదవగాహన, యిచ్చిపుచ్చుకునే అనుబంధం" అన్నారు.

ఈ యిచ్చిపుచ్చుకునే ధోరణిని వర్ణించలేము. చర్చలకు అందని విషయమది. దానిని చర్చలద్వారా వివరించుటకు, ప్రవచించుటకు ప్రయత్నిస్తే అత్యంత సన్నిహితంగా ఏర్పడ్డ ఆ ప్రేమయొక్క లక్షణాన్ని నాశనం చేయుటే కాగలదు. అనవసరప్రసంగాలకు తావీయక, అవతారుని సమక్షంలో లభ్యమైన ఈ సదవకాశాన్ని పూర్తిగా వుపయోగించుకోండి. నా సమక్షంలో వున్నట్లు తప్ప తక్కిన సమస్తాన్ని మరచిపోవుడు. మీ దృష్టి నంతా నామీదనే కేంద్రీకరించుడు. నేనే ఆ సనాతుడను" అని మళ్ళీమళ్ళీ చెప్పారు.

భగవంతునిముందు ఎలా సర్వసమర్పణ చేసుకోవాలో వివరిస్తూ పెంపుడు సింహాన్ని పెంచుటకు సంబంధించిన కథ ఒకటి చెప్పారు. "సింహాలంటే యిష్టమున్న ఒకతను ఒక సింహాన్ని తెచ్చి పెంచుతున్నా డనుకొనుడు. అయితే అతడు దానిని పెంచుతున్నా, అది మృగరాజు అనే భయంతో దానినొక బోనులో బంధించాడు. పెంచాలనే కోరిక వున్నప్పటికీ అది సింహమనే భయంతో బోనులో పెట్టాడు. అయితే దాని యందున్న ప్రేమకొద్దీ ఆహారాన్ని దూరంగావుండి, బోనులోకి విసురు తున్నాడు సింహం ఎప్పుడూ బోనులో బంధింపబడేవున్నది. అతడు దూరంగావుండి ఆహారం పెడుతున్నాడు. అలాగే నా ప్రేమికులంతా నన్ను, అతడు ఆ సింహాన్ని పెంచినటు, ప్రేమిస్తున్నారు. వారిలో ప్రేమున్నది. వుత్సుకత వున్నది. అయితే ఆ ప్రేమంతా తమ కోర్కెల మధ్య బంధించివచ్చినపుడు అతడు బోనులో సింహాన్ని ప్రేమించినట్లే గదా!" అన్నారు.

భగవంతుడు తల్లిగా తండ్రిగా తానే అగుచున్నాడు. ఆయన అందరిలోనూ అన్నిటా వున్నాడు. మరి వీటన్నిటికీ అతీతుడు భగవంతుడు ఒకే సమయంలో తల్లిగా తండ్రిగా కూడా ఎలా పనిచేస్తాడో తెలుసుకుందాం. యింతకుముందు అవతారాల్లో అన్నిటికీ అతీతుడైన భగవంతుడు తాను తల్లిగా పరిఢవిల్లు అవకాశం కలుగలేదు.

ఈ యుగంలో అవతార్ మెహెర్‌బాబా తన దివ్య మాతృత్వాన్ని మనందరికీ అందిచ్చారు. తానే దైవతుల్యమైన తండ్రిగా, మాతృమూర్తిగా రెండూ తానే అని చెబుతూ "ఈ అవతార కాలంలో నేను నా తండ్రి ఆదేశంమేరకు, నూరుశాతం అనంతమగు వెలుగుతో సర్వసమర్థంగా పరిపూర్ణుడుగా నడుచుకొని ఆయనను సంతోషపెట్టి నా తండ్రికి ముద్దులకొడుకునైతిని. అదే సమయంలో పాశ్చిమ దేశాల్లో నాకు ఏడమ శరీరాంగాలు దెబ్బతిని శారీరికంగా అశక్తుడనైనప్పటికీ, నేను అత్యంత సామాన్య జీవితం గడిపాను. వ్యథను వెలువరించక, ఏ వైద్యసహాయం లేక అన్నిబాధలను భరించి, నేను నా తల్లికి యదార్థకుమారుడను కాగలిగాను. ఈ విధంగా ఈ అవతారయుగంలో భగవంతుడు తానే తండ్రిగా, తల్లిగా నటించాడు" అన్నారు.

అసలు తల్లి, తండ్రి స్వామ్యంగురించి తెలుసుకుందాం. భౌతికపరంగా తల్లి, తండ్రి అంటే ఏమిటి? ఒక భార్యాభర్తల జంట. వారికి ఏడుగురు సంతానం వున్నారనుకోండి. ఆ ఏడుగురు సంతానానికి ఆ జంట తల్లి తండ్రి అగుచున్నారు. తనకు వుపయోగపడ్డ బిడ్డలయందు అధికప్రేమ వుండుట తండ్రికి సహజగుణం. బాగా ఆరోగ్యంగా అందంగా వున్నవారిపైన, తెలివితేటలుకలవారిపైన మక్కువ ఎక్కువ. ఆ ఏడుగురు సంతానంలో ఆరుగురు బాగా తెలివిగలవారు, మేధా సంపన్నులు, అందమైన వుత్సాహవంతులై ఏడవవాడు అవిటివాడనుకొనుడు. అప్పుడా తండ్రి ఏడవవానిపై ఎట్టి ప్రేమనూ చూపడు. పై ఆరుగురి

యందు యెక్కువ ప్రేమ ప్రదర్శిస్తాడు. యిది ప్రకృతి లక్షణం. అయితే తల్లిది మాతృహృదయం. ఆమె ఆరుగురికంటే, అవిటివాడయిన ఏడవ వానియందే యెక్కువ మక్కువ చూపుతుంది. యెందుచేత? అతడు అవిటివాడు. అశక్తుడు. అమాయకుడు. అందుకే ఆమె అతడిని ఎక్కువగా ప్రేమిస్తుంది.

భగవంతుడు తల్లీ తండ్రీ తానే అగుచున్నాడు. యింతకు ముందున్న అవతారాలన్నీ చక్కని ఆరోగ్యంతో వున్న రూపాలో అవతరించి తన కార్యక్రమాలను నెరపి వెళ్ళారు. వారంతా అతీత స్థితిలోవున్న దైవ కుమారులు. మానవాళినుద్ధరించుటకు మానవుడుగా, ఎప్పుడూ పురుష రూపంలోనే అవతరిస్తున్నాడు. దైవం తానే తల్లిగా బహిర్గతమగు సదవకాశం యీ యుగంలో అవతార్ మెహెర్‌బాబాగా మనకు ఎరుకపరచాడు.

అజానుబాహుడు, భీమబలుడయిన అవతార్ మెహెర్‌బాబా తన శరీరాన్ని పాతికమంది శిష్యులు సైతం ఏకబిగిని పట్టి నలిపి తుదకు వారే అలసిసొలసిరికానీ, బాబా యిసుమంతకూడా నలగలేదు. అంతటి బాహుబల సంపదను ప్రదర్శించి తండ్రిగా తన పాత్రను గ్రహింపచేశారు. అంత్యదశలో చరమాంకంగా శరీరమంతా వికావికలై, విచిత్ర వ్యాదికిలోనై, ఆ వ్యధలో అద్వితీయమాతృత్వాన్ని వర్షించునట్లు చేశారు. ఏ యుగంలోనూ లభ్యంకాని సదవకాశం, బాబా యీ యుగంలో మనకు కలుగునట్లు చేశారు. అద్వితీయ భగవంతుడగు తండ్రికి ఆరోగ్య లక్షణములు కల దైవ కుమారుడుగా, అద్వితీయ భగవంతుడగు తల్లికి, అనారోగ్య లక్షణములు కల దైవ కుమారుడుగా దృగ్గోచరుడై అన్నిటికీ అతీతుడయిన భగవంతుడు తానే తల్లి, తండ్రి అగుచున్నాడని మనకు ఎరుకపరచారు బాబా.

ఆఖరిసారి అమెరికా పర్యటించి వచ్చిన దరిమిలా బాబా ఎక్కువకాలం ఏకాంతంగా మెహెరాజాద్ ఆశ్రమంలో నే

గడుపుతూ, అరుదుగా దర్శనార్థులను కలుసుకొనేవారు. 1962-68 మధ్య కాలంలో ప్రజా దర్శనములు పూర్తిగా రద్దుచేశారు. 60-62 సంవత్స రముల మధ్య సామూహిక దర్శనములు కొద్దిగా జరిగినప్పటికీ సందర్శ కుల సంఖ్య బహుస్వల్పంగా వుండేది. ముఖ్యంగా 64-67 సంవత్సర ములు బాబాయొక్క ఏకాంతవాసం తీవ్రమైంది. ప్రేమికులతో జరిపే ఉత్తర ప్రత్యుత్తరములు సహితం తగ్గించివేశారు. సందర్శకులను కలుసుకొనుటకూడా తగ్గించారు.

బాబాయొక్క అంతరంగిక కార్యవిధానము ఏమైనప్పటికీ ఆయన ఆరోగ్యం బాగా క్షీణించిపోయినది. ఆరోగ్య రీత్యా శరీరంలో అనారోగ్య లక్షణాలు కనబడుతున్నప్పటికీ చెప్పుటకు వీలుగాని విధంగా బాబా ఎంతో వుల్లాసంతో ఆరోగ్యంగా వున్నట్లుండేవారు 1968 సెప్టెంబరులో శిష్యులతో ఆయన ముచ్చటిస్తూ, "నా పని పరిసమాప్తమైనది. నేను నా కార్య క్రమాన్ని నూరు శాతం సంతృప్తితో పూర్తి చేసితిని. యీ పనియొక్క ఫలితంగూడా నూరు శాతమే" అన్నారు. అప్పటికి చాల కాలంనుండి ఆయన దర్శన భాగ్యం కొరకు పరితపించే ప్రేమికుల గురించి ప్రప్రథ మంగా ఆయనను చూడాలని కోరుకుంటున్న క్రొత్త ప్రేమికుల గురించి వుద్దేశించి యిలా ప్రకటించారు. "నేనుకూడ వారిని చూచుటకు తపన పడుతున్నాను. అయితే యింకా తగుసమయం రాలేదు. అందుకే నేనూ, మీరూ, నా ప్రేమికులు మనమంతా యింకా కొంత కాలం ఆగాలి" అన్నారు.

## నిర్యాణము

1959 ప్రథమ భాగంలో బాబా బొంబాయి, పూనాలను తరచు సందర్శించేశారు. మెహెరాబాద్‌కు యిరువదిమైళ్ళ దూరంలో వున్న మెహెరాజాద్‌లో ఎక్కువ కాలం ఏకాంతంగా గడుపుతున్నా అప్పు

దప్పుడు కొద్ది సంఖ్యలోని ప్రేమికులకు దివ్యదర్శనం యిస్తూవుండేవారు. పూనాలో బరోడ మహారాణి బాబాకు సమర్పించుకున్న గురుప్రసాద్ బంగళాలో ఎక్కువకాలం వెచ్చించేవారు. కుష్టురోగులకు, అంటరాని వారికి ఆర్థిక సహాయం చేస్తూవుండేవారు,

ప్రేమికులందరికీ ఒక దివ్యసందేశంయిస్తూ "ఎలాంటి పరిస్థితులలో కూడా ఏమి జరిగినా చలించక, నన్ను అంటిపెట్టుకొని వుండుడు. జీవన స్రవంతిలో మీరు యెదుర్కొనే ఒడుదుడుకులకు విర్వీర్యులు కావద్దు. అవి యెటువంటి కష్టాలయినా సుఖాలయినా నాచే సృష్టించబడినవి. నేను ఆరు నెలలపాటు ఏకాంతవాసం గడిపెదను. మీరంతా మారు ఆలోచన లేక నన్ను అంటిపెట్టుకొని నన్నుగురించిన ఆలోచనలతో నా నామస్మరణచేస్తూ గడపండి" అని ప్రకటించారు.

"నా ఏకాంతకాలంలో నన్ను ఎవరూ చెదరగొట్టవద్దు. మీకు నా యందున్న ప్రేమను వ్యక్తీకరిసూ వుత్తరప్రత్యుత్తరాలుకూడా చేయవద్దు. నేను మీకు తరుచుగా చెప్పుచున్నాను—నా కొంగు విడువవద్దని. ఇప్పుడు రెండుచేతులతోనూ నా కొంగు పట్టుకొనవలసిన సమయం వచ్చినది. ఏ కారణంచేతనయినా ఒక చేయి జారిపోయినా రెండవచేయి గట్టిగా పట్టుకొనుటకు అవకాశం వుంటుంది. కనుక రెండుచేతులతోనూ నా కొంగును గట్టిగా పట్టుకొని వుండుడు" అన్నారు.

1960లో యూరూప్ ప్రేమికులకొక లేఖ వ్రాస్తూ "ప్రియతమ బాబా యిప్పుడు తన పరిసరములన్నింటియందు అయిష్టత ప్రకటించారు. ఆయన అన్నిటికీ అతీతమైన అద్వితీయమైనదగు ఏదో తెలియని తీవ్రవిషయంలో నిమగ్నం కావాలని నిశ్చయించు నట్లు కనపడుచున్నది. తన అద్వితీయ మౌనంలో తన అన్ని బాహ్యాచర్యలందు మౌనం ప్రదర్శిస్తున్నారు. ఆయన దేనినీ వినుటకు, చూచుటకు, ఎవరితోనూ సంభాషణ చేయుటకు అయిష్టత చూపుతున్నారు. మెహెరాబాద్ మొత్తం వాతావరణం అంతా స్తబ్ధతతో

వున్నది. కనుక ఎవరూ మెహెరాజాద్‌తో ప్రత్యక్షసంబంధం పెట్టుకో వద్దు" అని కోరాడు.

చివరకు మెహెర్‌బాబా 1968 అక్టోబర్ 19వ తేదీన ఒక ప్రకటన చేస్తూ 1969 ఏప్రియల్ 10నుండి జూన్ 10వ తేదీవరకు తన ఏకాంత వాసమును విరమిస్తున్నానని, ఆ సమయంలో తన ప్రేమికులకు తన దర్శన భాగ్యం కలిగిస్తానని" ప్రకటించారు.

ఆయన శరీరపరిస్థితి గమనిస్తున్న శిష్యులు బాబా దర్శన సమయంలో శ్రమకు తట్టుకొనలేరేమోనని భయపడ్డారు, అసలు బాబా 1969 జనవరి, ఫిబ్రవరులలోనే దర్శనమిచ్చెదనని సూచించగా మండలి ఆయన ఆరోగ్య విషయం లేవనెత్తగా "అంతా సవ్యంగానే జరుగు" నని చెప్పారు.

కానీ శిష్యులు బాబాను మరోవిధంగా ఆ కార్యక్రమం వాయిదా పడునట్లు ఒప్పించగలిగారు. జనవరి ఫిబ్రవరి మాసములు చలిగాలులు వీచే శీతాకాలం. కనుక దర్శనార్థులు ఆ చలికి తట్టుకొనలేరు. ఏప్రియల్ జూన్ మాసములయితే ఎండలు బాగావుండి చలిపోతుంది. వాతావరణం ఆహ్లాదకరంగావుండి, ఎట్టి యిబ్బందిలేకుండా అందరూ దివ్యదర్శనం చేసుకొనగలరు" అని చెప్పి ఒప్పించారు.

వారి వుద్దేశ్యంలో యేదోవిధంగా తాత్కాలికంగానైనా దర్శన భారాన్ని కొంతకాలం పొడిగిస్తే యీలోగా బాబా ఆరోగ్యం మెరుగుపడగలదని వారి ఆలోచన.

బాబా అన్నారు "మీయిష్టం. అలాగే కానీయండి అయితే యీ మారు నా దర్శనం మామూలుగాకాక, పడుకునే అందరికీ నా దర్శనం యిస్తాను. ఏది ఎలా అయినప్పటికీ, నాపై విశ్వాసముంచినవారికి, ఎప్పుడో, ఎక్కడో, ఎలాగో నా దర్శనభాగ్యం దొరకగలదు" అని!

రోజురోజుకూ క్షీణిస్తున్న బాబా ఆరోగ్యంగురించి ఆందోళన పడు

తున్న మండలి ఎవ్వరుకూడా యీ సూచనను గమనించలేకపోయారు.

1968 శిశిరం ఎలాగో గడిచిపోయింది. బాబా ఆరోగ్యం బాగా క్షీణించిపోయింది. అయినప్పటికీ బాబా మండలితో అంతా సవ్యంగా జరిగిపోతుందని ధైర్యం చెప్పేవారు. బొంబాయినుండి, పూనానుండి వైద్యులు పిలిపించబడ్డారు. ప్రఖ్యాత వైద్యనిపుణులుసైతం, ఆయన శరీరస్థితిని లక్షణాలను సుదీర్ఘంగా పరీక్షించికూడా వ్యాధి నిర్ణయించేయలేకపోయారు. ఆయన రక్త పరీక్షనుబట్టి తేలిందేమంటే. అట్టి లక్షణములున్న సామాన్య మానవుడయితే ఆ పరిస్థితిలో కోమాలోగాని, స్పృహ కోల్పోయిగాని వుండాలని డాక్టరులు చెప్పారు. అయితే బాబాస్థితి వారికి అనూహ్యమై, ఆశ్చర్యంతో వున్నారు. పైగా ఆయన అంత బాధలోనూ వైద్యులతో ఛలోక్తులాడుతూ వారిని హాస్యంతో నవ్వించారు.

1969 జనవరి గడిచిపోతున్నది. బాబా ఆరోగ్యం బాగా క్షీణ దశకు చేరుకున్నట్లు మండలి గ్రహించారు. బాబా శరీరంపై బాహ్యంగానే బాధలు ప్రస్ఫుటంగా ద్యోతకమవుతున్నాయి. అందుచేత మండలి బాబాను పూనా తీసుకువెళ్ళి పెద్ద వైద్యశాలలో రోగనిర్ణయ పరీక్షలు చేయించాలని సంకల్పించారు. అందుకు బాబా ససేమిరా వద్దని తిరస్కరించారు. శిష్యులెంతగానో ఆయనను వప్పించుటకు ప్రయత్నించారు. అందుకు బాబా "యీ నా ప్రస్తుత పరిస్థితి వైద్యమునకు అంతుపట్టనిది, దానికి సంబంధించినదికాదు. యిదంతయూ నా ఆధ్యాత్మిక కార్యక్రమం ననుసరించి కలిగిన శ్రమ ఫలితం. మీరేమీ వ్యధ చెందకుడు నిశ్చింతగా వుండుడు. అత్యంత ప్రాముఖ్యము గల విశేషము జరుగనున్నది" అని సూచనచేశారు.

జనవరి మాసాంతంలో బాబా శరీరం కండరముల యీడ్పులతో కదిపివేసినది. తత్ఫలితంగా చెప్పలేని బాధను బాబా భరించవలసివచ్చినది. మండలివారు అంతకుముందెన్నడూ బాబా అంతటి బాధపడుట

చూడలేదని చెప్పారు. రెండు కారు ప్రమాదములలోకూడ, బాబా శరీరాంగములు విరిగి కదిలిపోయినప్పుడుకూడ అంత వ్యధ పడలేదంటాడు ఈరుచ్. మరి అంతటి వ్యధను అనుభవిస్తున్నప్పటికీ బాబా తన మానసిక చైతన్యం కోల్పోక నిబ్బరంతో హాస్యం చిందిస్తూవుంటే మండలి సభ్యులు ఆశ్చర్యపడజొచ్చిరి. 1969 జనవరి 31 మధ్యాహ్నం పూట దాదాపు 15 నిముషములు పాటు అతి పెద్ద ఈడ్పువచ్చినది. శ్వాసాడుట ఆగిపోయినది. శిష్యుడు ఈరుచ్ ప్రక్కనే వున్నాడు. బాబా నోటిలో నోరుపెట్టి ప్రాణవాయువునందించుటకు తన శక్తికొలది గాలిపూరించాడు. కానీ లాభంలేకపోయింది. బాబా శాశ్వతంగా శాశ్వతనిద్రలో వుండిపోయారు.

హఠాత్తుగా జరిగిన దుర్వార్త బాబా ప్రేమికలోకమంతా క్షణాలలో ప్రాకిపోయింది. రానున్న దర్శన కార్యక్రమానికి సమాయత్తమవుతున్న అశేషప్రేమిక సందోహం డోలాయమానులైనారు. మండలితో సంబంధం పెట్టుకొని రుజువుచేసుకొంటేనేగాని చాలమంది అసలు ఈ వార్తను నమ్మలేదు. చివరికెలాగో తమాయించుకొని కొందరు బాబా అంతిమ దర్శనానికి బయలుదేరారు.

మరికొందరు బాబా అందించిన దివ్యసందేశాలు, ప్రవచనముల సారాన్ని మరొకమారు మననం చేసుకొని అవతారుని లీలలను అర్థం చేసుకొనుటకు ప్రయత్నించారు.

  

అవతారుని ఆగమనం, ఆయనచేసే విశ్వ కార్యక్రమం గురించి ఆరంభంలో కొంత వరకు మీ ముందుంచుటకు ప్రయత్నించాను. అయితే మాయా జనితమై పిపీలకాదిపర్యంతం, సకల జీవకోటి రాసులతో అలరారుచున్నయీ సువిశాల జగత్తుకు మూలకారణం అద్వితీయశక్తి జ్ఞానానంద స్వరూపుడైన పరమాత్మ. అట్టి పరమాత్మ తానేనని శలవిచ్చారు అవతార్ మెహెర్‌బాబా. బహుజన్మల తపఃఫలం

మానవజన్మ. మోక్షార్హమైన మానవజన్మను ఎలా సార్థకం చేసుకోవాలో బాబా సృష్టిరహస్యాన్ని వివరిస్తూ చెప్పారు. ఆ వైనం కొంతవరకూ మీముందుంచుతాను.

బాబా ప్రవచనాలు "దైవాన్వేషణ" అను విషయంపై ప్రారంభించ బడినవి. "భగవంతుని వునికి గురించిన అనుమానంకూడ లేనివారెందరో వున్నారు. అట్టివారు ఆయన వునికిని గురించి ఆలోచించరు మరి కొందరి వూహలో భగవంతుడు వుండవచ్చును లేకపోనూవచ్చును. ఆయ నంటూవుంటే ఆయన గురించిన అన్వేషణ ఫలప్రదం అవుతుంది. ఆయన వునికి లేకపోతే చేసిన అన్వేషణవలన పొందే నష్టమేమీ వుండదు అనిపి స్తుంది. అయితే అట్టి అన్వేషణ సమస్తము త్యజించి మాయకు అతీ తంగా వుండకలిగి అంత ప్రగాఢతాతీక్షణతో అన్వేషిస్తే ఆయన వునికిని గ్రహించగలరు" అన్నారు

యథార్థానికి ఆత్మవేరుకాదు, అది పరమాత్మ స్వరూపం భగ వంతుడు, ఏకైకుడు, అనంతుడు, శాశ్వతుడు అని ఎవరిని తలుస్తున్నామో యీ జగత్తులో ఎవరి ప్రాపంచకజీవితం సకల జీవరాసులకు ఆలింగన మొనర్చుకొనియున్నదో అట్టి సర్వేశ్వరుని ఆత్మ అగుచున్నది అనగా ఆత్మ పరమాత్మ విడదీయరాని బంధం కలవి. అయితే బాహ్యంగా అనంత శక్తి అనంతజ్ఞానం అనంత ఆనందముల స్వరూపమైన పరమాత్మే తానన్న ఎరుక యీ ఆత్మకు ఆరంభంలో వుండదు. యీ సత్యాన్ని తానూ పరమాత్మ ఒకటేనన్న అనుభవ జ్ఞానం పొందుటకు చైతన్యవంతులగు పరిణామము క్రమేపీ కలగాలి.

ఈ విషయాన్నే బాబా వివరిస్తూ "ఆత్మ, పరమాత్మయొక్క అనంతస్థితిలో సదానందానుభూతిని చైతన్యవంతంగా అనుభవించుటే యీ సృష్టియొక్క ప్రధాన అవశ్యకత" అన్నారు. "ప్రేమ"ను గురించిన ప్రవచనములలో "ప్రేమకొరకు యీ సృష్టి అంతా జగత్తురూపంలో

వుద్భవించింది. మరి ఆ ప్రేమకొరకే, అది యింకా కొనసాగుతున్నది" అన్నారు.

అసలు మానవజీవితం, దాని గమ్యం వివరిస్తూ చక్కని వుపమానాన్ని అందించారు. "విలకడవున్న సముద్రంపై అలలు వుబుకుతూ ఒడ్డుకు చేరుతుంటాయి. ఆ సమయంలో అనంత జలబిందువులు మీది కెగసి పడుతూవుంటాయి. అలాగే అనంతుడయిన పరమాత్మ చైతన్యవంతమై, చలనం కలిగి, పుంఖానుపుంఖములగు వ్యక్తిగత ఆత్మలను తన అగోచరమగు అనంతత్వంనుండి వుద్భవింపచేయును. మహాసాగరం వంటి ఏకైకుడైన ఆ పరమాత్మనుండి వెలువడిన అనంతమగు లెక్కలేనన్ని యీ వ్యక్తిగత ఆత్మలన్నీ ఆ పరమాత్మ స్వరూపాలే అగుచున్నవి అలల తాకిడికి పై కెగసిన సముద్ర నీటిబిందువులు తాము వేరన్న భావంతో మిడిసిపడినా, మరల సముద్రములో మరుక్షణమే ఏకాగున కలియుచున్నవో అలాగే పరమాత్మనుండి వెలువడిన వ్యక్తిగత ఆత్మలన్నీ మరలా ఆ పరమాత్మలో సంలీనం కావలసి యున్నది.

మరి, పరమాత్మనుండి వెలువడిన ఆత్మతిరిగి పరమాత్మలో సంలీనమగుటకు చేసే ప్రయాణమే పరిణామక్రమం అంటున్నారు బాబా. పరిణామ చరిత్ర అంటే పరమాత్మనుండి అనగా అనంత చైతన్యంనుండి బహిర్గతపడిన ఆత్మ చైతన్యరహితమైవుండి క్రమంగా తిరిగి చైతన్యవంతమగుట. తిరిగి సహజచైతన్యం పొందుటకు యీ దృశ్య ప్రపంచచైతన్యం అనుభవించుటకు, అట్టి ఆత్మ ఒక రూపాన్ని తీసుకుని దాని ద్వారా అనుభవం సంపాదించును. మొట్టమొదటి భౌతికరూపం "శిల". పరిణామరూపంలో శిలగా మారిన ఆత్మ పూర్తిగా స్తబ్ధితతో చైతన్యరహితంగా వుంటుంది. శిలారూపంలో వ్యక్తీకరించబడిన పరమాత్మ స్వరూపమై ఆత్మ, ఎదుగు బొదుగూ లేక జడపదార్థమై వుంటుంది.

ఈ దశలో అట్టి శిలలో క్రమేణా పరమాత్మ తేజస్సుయొక్క చైతన్యం సహాయంతో వున్నతరూపం పొందే పరిణామదశలో ప్రవే

శి.చుపు.

చైతన్య పరిణామం, శరీర పరిణామం రెండూ కలిసికట్టుగా అభివృద్ధి చెందుతాయి క్రొత్తరూపం పొందాలనే తహతహ చైతన్యానికి ఎప్పుడయితే వచ్చిందో, ఆ వెనువెంటనే శరీరంకూడా మార్పు చెందాలని ఆరాటపడుతుంది. శిలగా మారిన ఆత్మ, లోహంగా పరిణతి చెందుటకు పరమాత్మచే ప్రేరణ చేయబడును. యీ లోహరూపంలోకూడా చైతన్యం అంతగా అభివృద్ధి చెందదు. ప్రారంభదశలోనే వుంటుంది. లోహరూపంనుండి తిరిగి పరిణామక్రమంలో మొక్కగా, వృక్షంగా పరిణతి చెందును.

యీ దశలో చైతన్యం కొంతవరకు అభివృద్ధి చెందును. పెరుగుదలలో గణనీయంగా అభివృద్ధి జరుగును. జనన, మరణాల స్వామ్యం యీ దశలోనే ఆరంభం అవుతుంది. పెరుగుదల, నాశనం రెండూ కనబడుతూ వుంటాయి. పరమాత్మయొక్క ప్రేరణ ఈ దశలో మరీ పెరిగి అభివృద్ధిచెంది, కీటకరూపం ధరిస్తుంది. పురుగుదశకు పరిణామం మత్స్యము ఆ తరువాత పక్షి, దరిమిలా జంతుదశవరకూ చైతన్యంతో పరిణతి చెందును. ఈ దశలలో వాటికి తమ శరీరజ్ఞానం వుంటుంది. పరిసరాలను గుర్తించును. ఆత్మరక్షణ చేసుకొను జ్ఞానం సంపాదించును. తమ వునికి పెంపొందించుకొని, అభివృద్ధి సాధించాలనే తపన కలుగును. సంతానాభివృద్ధికొరకు పరితపించును.

చివరగా పరమాత్మ పరిణామ క్రమంలో మానవరూపం దాల్చును. ఈ రూపంలో మనస్సు, మనస్సుతోపాటు విచక్షణాజ్ఞానం, ప్రపంచజ్ఞానం, పరిసరములజ్ఞానం యివన్నీ కలిగివుండును.

పరిణామక్రమంలో పరమాత్మ చేసిన ఈ ప్రపంచమంతా సృష్టిగా మారి దృశ్యప్రపంచమగుచున్నది. ప్రప్రథమ మానవరూపంపొందే, చిట్టచివరి జంతుదశలోని ఆత్మ, తన గత జన్మల అనుభవాల్ని ప్రోదిచేసుకొని

క్రొత్తరూపం ధరిస్తుంది.

ఈ ద్వంద్వప్రపంచంలో మాయకు లోబడి చైతన్యరహితమైన ఆత్మ, తిరిగి చైతన్యం సంపాదించుటకు పరమాత్మ ప్రేరణచే గత జన్మల అనుభవములనుండి విముక్తి పొందుటకు తాపత్రయపడును. చైతన్య పరిణామంలో ఎన్నో అనుభవాలు క్షణక్షణం పేరుకుపోతూ వుంటవి. వీటిని సంస్కారములు అంటారు.

సంస్కారములు గురించి బాబా ప్రవచనాలలో ఎంతగానో వివరించారు. యివి రెండురకములున్నాయి. ఒకటి సహజమైనది. రెండవది అసహజమైనది. "శిలారూపంనుండి, జంతుదశవరకూ సంపాదించే అనుభవాలన్నీ సహజ సంస్కారములు" అన్నారు. మానవరూపంలో పొందే అనుభవాలన్నీ అసహజ సంస్కారములన్నారు సహజ సంస్కారములు మొదలంటూ వేళ్ళు పాతుకుని ఒకపట్టాన వదిలించుకొనుటకు అవకాశంలేనివి. అట్టి జటిలమైన సహజ సంస్కారాల్ని వదిలించుకొని మానవరూపం దాల్చిన తరువాత సంక్రమించే అసహజ సంస్కారాలు వదిలించుకొనుటకు అంత కష్టపడవల్సిన పనిలేదు. సద్గురు కృప లభ్యమయితే సమస్త సంస్కారాలు తుడుచుకుపోతాయి.

అయితే బాబా ముఖ్యంగా మనలను ఒక విషయం గుర్తించుకోమన్నారు. "గత జన్మల అనుభవములతో మానవజన్మకు సంక్రమించిన సహజ సంస్కారములు, సద్గురు కృపలేనిదే వదిలించుకొనుట చాలా కష్టం" అన్నారు. సంస్కారములు సంపాదించుటను దారపుబంతితో పోల్చారు. దారపుకండెకు చుట్టే దారం సంస్కారములనీ, కండెలోని పుల్ల, వ్యక్తిగత ఆత్మయొక్క మనస్సని అన్నారు. సంస్కారములు కండెకు చుట్టే దారంవలె మనస్సును పెనవేసుకుంటాయి.

ఈ భౌతిక ప్రపంచం యదార్థంకాదు. యిదంతా మిధ్య. అది సత్యానికి ఎంతో దూరంలోవుంది. "సత్యానికి దూరంగావుండేది స్థూల

ప్రపంచం. సమీపంలో వుండేది సూక్ష్మప్రపంచం. సన్నిహితంగావుండేది మానసికప్రపంచం" అన్నారు బాబా. తక్కిన రెండు ప్రపంచాలు వున్నాయో లేవో మనం వూహించుటేగానీ, మనకు తెలిసిన స్థూల ప్రపంచం మాత్రం మిధ్య అన్నారు. అయితే ఆత్మ వీటన్నిటికీ అతీత మయింది. అది తన వృత్తికివి, తననుతాను తెలుసుకొనుటకు చేసే ప్రయత్నంలో తనకు తెలియకుండానే ఈ మాయలో చిక్కుకొని మిధ్యా ప్రపంచంలో, మిథ్యారూపంతో, ఎంతోకాలం సుదీర్ఘప్రమాణం చేస్తున్నది. ఎన్నో అనుభవాలు సంపాదించి, చివరకు అంతంలో వాటినుండి విముక్తి సాధించి, సత్యాన్ని గ్రహించగలుగుచున్నది.

కాలచక్రభ్రమణంలో జరిగే యీ సుదీర్ఘప్రమాణమే జనన మరణములు అంటున్నారు. భవబంధాలకు బద్ధుడై జీవిస్తేనే బంధవిముక్తుడగుచున్నాడు. బంధమే లేనప్పుడు బంధవిముక్తి లేదుకదా! బంధములతో కూడిన అనుభవం వుంటేనే విముక్తి లభ్యమవుతుంది. ఎట్టి బంధములు లేకుంటే, మానవునికి యదార్ధ ముక్తియొక్క అవగాహన కలుగదు. "కర్మ పునర్జన్మ యీ రెండు అందుకే పెనవేసుకు వుంటాయి" అన్నారు బాబా. కర్మఫలాలు పూర్తిగా అనుభవిస్తేనేకానీ, ఆత్మకు విముక్తి రాదు. అట్టి విముక్తి వస్తేనే ఆత్మ తన గమ్యంచేరి పరమాత్మలో లీనంకాదు.

దారపుకండెకు చుట్టుకున్న దారం వూడదీసినట్లు, మనస్సు చుట్టూ చుట్టుకున్న సంస్కారములు వూడదీయుటకు ఆత్మ, మళ్ళీమళ్ళీ మానవ రూపంలో పునర్జన్మ పొందవలసి వచ్చును. "లెక్కలేనన్ని మానవ జన్మలు ఎత్తుట అంతా కర్మసిద్ధాంతం ప్రకారం జరుగును" అన్నారు బాబా. యిలా ఎనలేని పునర్జన్మలకు మూలకారణం సంస్కారములగుచున్నవి. నిత్యం మనం పొందే సుఖదుఃఖాలు, కష్టసుఖాలు, మున్నగు ద్వంద్వానుభవాలు యీ సంస్కారములకు మూలకారణం. "స్థూల ప్రపంచంలో వ్యక్తిగత ఆత్మపొందే అనుభవాల ఫలితంగా ఒక శరీరాన్ని

త్యజించి, మరో శరీరాన్ని తీసుకుంటుంది. మనం శరీర త్యాగాన్ని మరణమని, క్రొత్తశరీరం దాల్చుటను జననమని అంటున్నామన్నారు బాబా. ఆత్మ శరీరము కాదని, ఆత్మ వేరు శరీరము వేరని దానినిబట్టి మనకు అవగతమగుచున్నది.

ఆత్మ తన సంస్కార ప్రభావములనుండి విముక్తిబడయుటకు ముందు ఎనలేని స్త్రీ పురుషరూపాలలో జన్మలు తీసుకొనవలసియున్నది. ద్వంద్వానుభవాలు, ద్వంద్వరూపాలు, ద్వంద్వభావాలు యివన్నీ ప్రకృతి సహజ పరిణామానికి మూలకారణం. అంతేకాదు, ఆడ మగ రూపాలు సృష్టిలో పరిణామానికి, అవిభాజ్యము, అగోచరమగు వునికికి మానవుని చేర్చుటకు ఆవశ్యకములగుచున్నవి.

ప్రతివారు సత్యాన్ని తెలుసుకొని, సాక్షాత్కారం చేసుకోవాలని తాపత్రయపడతారు. అయితే అజ్ఞానమనే మాయలో చుట్టబడివున్నందున, అజ్ఞానం, అజ్ఞానమని తెలుసుకొనగలిగిననే తప్ప, సత్యాన్ని సత్యంగా తెలుసుకొనలేరు. అందుకే మాయనుగురించి ముందుగా తెలుసుకొన వలసివున్నది. మాయనుగురించి ఎంతగా తెలుసుకొనుటకు మనము ప్రయత్నిస్తే, అంతగా అందులో యిరుక్కుపోతాం. అయితే మనలను అట్టి అజ్ఞానబంధంనుండి విముక్తులనుచేసి, సత్య సాక్షాత్కారం చేయించుటకు, సాక్షాత్తు ఆ పరమాత్మ, తన అనంతశక్తి, జ్ఞానాలద్వారా తన అపారదయను, కృపను తనచే సృష్టించబడిన మానవాళిపై ప్రసరింపచేయును.

మనకట్టి ఆత్మజ్ఞానం సుబోధకమైనప్పుడు, అజ్ఞానం అన్ని రూపాలలో నుండి తుడుచుకుపోతుంది. అప్పుడు తానే మానవదైవమై యదార్థమరణం పొందుచున్నాడు. శాశ్వతంగా పరమాత్మలో సంలీనమగుచున్నాడు ఇదీ స్థూలంగా ఈ సృష్టి రహస్యం.

మాయ బహు బలీయమయినది. ఈ అసత్య, మిథ్యాప్రపంచాన్ని

మాయే సృష్టిస్తున్నది. మాయ అంటే మిధ్య కాదు. మిధ్యకది సృష్టికర్త. మాయ అంటే, అసత్యం (ఫాల్స్) కాదు. అసత్య సంస్కారాల్ని అది యిస్తుంది. మాయ యదార్ధం కానిది కాదు. అది యదార్ధమైనదానిని యదార్ధం కానట్లు, యదార్ధం కానిదానిని యదార్ధమైనట్లు చూపుతుంది.

మాయ ద్వంద్వంకాదు. అది ద్వంద్వానికి కారణహేతువు. కాలంకూడ మాయచే సృష్టించబడినది. కాలం మాయలోనే వున్నది. మాయ కాలంలో లేదు. మాయ వుంటే కాలం వుంటుంది. మాయ పోతే కాలం పోతుంది. కాలరహితమయిన సత్యం దైవం. అందుకే దైవసాక్షాత్కారం, మాయ అగోచరం. ఈ రెండు కాలరహిత చర్యలగుచున్నవి. భగవంతునివలెనే మాయకూడా అనంతమయినది. శాశ్వతమయినది. భగవంతునివలెనే ఎవరూ కొలవలేనిది మాయ. ఎవ్వరూ ఎరుగలేనిది మాయ. అందుకే మాయ భగవంతుని ఛాయ. మానవుడెక్కడవుంటే, అతని చాయ వెన్నంటివుండునో అట్లే మాయ ఛాయలా భగవంతుని అంటిపెట్టుకొనివుంటును.

ఎరుకతోనో, ఎరుకలేకనో ప్రతి జీవి ఒకేదానిని గురించి అన్వేషించును. హీనజన్మలలోనో, బాగా అభివృద్ధి సాధించని మానవదశలోనో యీ కోరిక అచైతన్యంతో ఎరుకలేకుండా వుంటుంది. పురోభివృద్ధి చెందిన మానవులలో అట్టి కోరిక ఎరుకతో అన్వేషించును. యీతితీక్షణ ఎన్నో రూపాల్లో ప్రస్ఫుటమగును. వాటిని సుఖమని, శాంతి అని, స్వేచ్ఛ, సత్యం, ప్రేమ, పరిపూర్ణత్వం, ఆత్మసాక్షాత్కారము, దైవసాక్షాత్కారమని, యింకా ఏమేమో అన్నారు. అయితే మనమొక విషయం గుర్తుంచుకోవాలి అసలు ఈ సృష్టి అంతా పరిణామక్రమంలో ఏర్పడినది

మరి ఈ పరిణామం అచైతన్యవంతమగు దైవత్వంనుండి

చైతన్యవంతమగు దైవత్వంనకు పరిణతి చెందుచున్నది. తుదకు తానే శాశ్వతుడు. అనంతుడగు దైవంగా భాసిల్లుచున్నది.

బాబా ప్రకటననొకదానిని యీ సందర్భంలో గుర్తు చేసుకోవాలి "శిలగా ఏ చైతన్య పరిణతి చెంది పరిణామక్రమాన్ని ప్రారంభించినదో ఆ చైతన్యమే క్రమశః పరిణతిచెంది మానవదైవంగా రూపుదాల్చింది. మానవాళికదొక సౌగంధిపుష్పం"

"దైవకుమారుడు అందరిలోనూ వున్నాడు అయితే ఆయన అవతరించును" అని ప్రకటించారు బాబా. దీనినే జీసస్‌క్రీస్తు, "నేను, నా తండ్రి ఒకటే. నావలన తప్ప ఎవరూ నా తండ్రిని చేరలేరు" అని చెప్పిన సూక్తితో సరిపోల్చవచ్చును. 1952 ప్రాక్పశ్చిమ సమావేశంలో బాబా యీ విషయం ముచ్చటిస్తూ "నా ప్రియమయిన బిడ్డలారా" అని సంబోధించారు.

ఆ పిలుపులోని మాధుర్యం అమోఘం. ప్రాక్పశ్చిమ ఖండాలలో వున్న తన పిల్లలంతా తండ్రిగృహంలో కలుసుకున్నట్లు ఆ సంబోధనలో ద్యోతకమవుతుంది. యీ విషయాన్నే బాబా పేర్కొన్నారు. "దేశదేశాలలో వున్న నా పిల్లలంతా తమ తండ్రిగృహంలో కలుసుకుంటున్నారు అన్ని మతాలు యీ సృష్టికి కారకుడైన తండ్రి ఒకే దైవం అని ఘోషిస్తున్నాయి. ఆ తండ్రిని నేనే, యీ పుడమిపై వున్న సర్వ మానవాళి తామంతా ఒకేతండ్రికి చెందిన బిడ్డలమని తెలియచెప్పుటకే నా రాక. వారంతా నా బిడ్డలే అయినా, యీర్ష్యాద్వేషాలకు, కామక్రోధాలకు బానిసలయి. వారిలో శత్రుత్వాన్ని పెంచుకొని, తమ తండ్రిగృహంలో సమిష్టికుటుంబంగా జీవించుటకు బదులు, అజ్ఞానంతో యదార్థసత్యాన్ని విస్మరిస్తున్నారు."

"మీరంతా నన్ను మీ యథార్థ తండ్రిగా భావిస్తే మీ మధ్యవున్న వ్యక్తిగత ద్వేషాలు, వ్యక్తిగత సమస్యలు నాకు వదలిపెట్టి, నా అనంతర ప్రేమ మహాసాగరంలో కరిగించి వేయండి. నాలో అంతటి ఓర్పు సహనం

వున్నది. మీరు నా ప్రేమలో యింకా చాల పసివారు. పసివారు ఆడుతూ పాడుతూ కేరింతాలు కొడితేనే అందంగా ముద్దొస్తారు. మీరు వయోవృద్ధులైనప్పటికీ, పసిహృదయంతో నా ప్రేమనాస్వాదించండి" అన్నారు బాబా.

"ఎందరో అన్వేషించి, ఏ కొద్దిమందో తెలుసుకొనగలుగు ఆ ఏకైక సత్యాన్ని నేను. మేధాసంపదతో నన్నెవరూ కొలవలేరు. పూజా పునస్కారాలు నన్ను చేర్చలేవు. ఎవరైతే నన్ను ప్రేమిస్తారో, నాలోని తమ ఆత్మను ప్రేమించ కలుగుతారో వారు నన్ను కాంచగలరు. నేనీ శరీరాన్ని త్యజించినప్పుడు నన్ను ప్రేమించు వారందరిలో నేనుందును నేనెన్నడూ మరణించను. నాకు మరణంలేదు. నేను శాశ్వతుడను. నన్ను ప్రేమించండి. నాకు విధేయులు కండు. నాపై విశ్వాసముంచుడు మీరు నన్ను కాంచగలరు" అన్నారు.

వేరొక సందర్భంలో బాబా "భగవంతుడు ఆకాశంలోనో, హిమాలయాలలోని కొండ గుహలలోనో కనపడడు. భగవంతుడు అందరి హృదయాలలో వున్నాడు. మీరొక పర్యాయం మీ హృదయాల్ని క్షాళనం చేసి పరిశుభ్రపరిస్తే భగవంతుడందులో ప్రకాశిస్తాడు" అన్నారు.

"భూవుపరితలంవదలి ఖండాతర ప్రయాణంచేసి మానవుడు విశ్వాంతరాళంలో చంద్రమండలంలో కాలూనినా అతను తనుగానే మిగిలివున్నాడు. అయితే ఖండాంతర పయనంకాక, మానవుడు తనలోనే నిక్షిప్తమైవున్న ఎనలేని సంపదను కాంచగలగాలి. భగవంతుడు మీలో తప్ప బాహ్యంగా ఎక్కడాలేడు" అని చెప్పారు.

"నేనందరిలోను వున్నాను. అయితే వారి హృదయాలలో నిద్రిస్తున్నాను. అనాదిగా అది నా అలవాటు. నన్ను లేపుటకు మీరు నన్నెప్పుడూ పిలుస్తూవుండాలి. బాబా, బాబా, బాబా అని పిలవండి" అని చెప్పారు. "నాతో మీకు వకసారి అంతరంగిక సంబంధం ఏర్పడినప్పుడు దివ్య

గొర్రెల కాపరినైన నేను నా గొర్రెలమందను, నా దివ్య ప్రేమతో నేను ఎక్కడవున్నా మీరు ఎక్కడవున్నా కాలానికి, చోటుకు, విలువ యివ్వకుండా మిమ్మలను అంటివుండి, కనిపెట్టి వుంటాను" అనికూడ చెప్పారు.

అందుకే బాబా శరీరత్యాగంతో ప్రతివారిలో కొంత ఆందోళన కలిగినప్పటికీ, మనందరి హృదయాలలో ఆయన యిప్పుడు నిండి వున్నారనే భావం వచ్చేసరికి ఊరటకలిగి బాబా నామస్మరణతో "అవతార్ మెహెర్‌బాబాకీ జై" అంటూ బాబా ఆంధ్రదేశ పర్యటనలో ఒకసారి "నేను నా గదిలో విశ్రాంతిలో వున్నప్పుడు నా ప్రేమికులంతా నా గది కిటికీచెంత రాత్రంతా నా నమస్మరణతో గానం చేస్తారు" అన్నట్లు దేశ విదేశాలనుండి బాబా అంతిమ దర్శనం చేసుకొనుటకు మెహెరాబాదు వచ్చిన అశేష బాబా ప్రేమిక సందోహం, రాత్రనక, పగలనక బాబా పవిత్ర సమాధిచెంత ఆయన గుణగానం చేస్తూ ఏడురోజులపాటు వుండిపోయారు.

బాబా అంతకుముందే తన శరీరత్యాగం జరిగినప్పుడు ఆ దివ్య శరీరాన్ని నిక్షిప్తం చేయుటకు స్థలనిర్ణయంచేసి తగు సూచనలతో కొన్ని ఆదేశాలిచ్చి వున్నారు. మెహెరాబాదు కొండపై ఎన్నడో 1925లోనే తన భావి సమాధిని స్వయంగా బాబా కట్టించారు. అందులో ఎన్నో ఏకాంతవాస కార్యక్రమాలు గడిపారు. బాబా మానవాళికందిచిన ప్రవచనాలు, యీ సమాధిలో అర్ధఏకాంతవాస కాలంలో యిచ్చిన సందేశాలే.

తాను తన శరీరాన్ని ఎప్పుడు ఎక్కడ త్యజించినా మెహెరాబాద్‌కు తెచ్చి, కొండపై నిర్మించిన యీ సమాధిలో వుంచి, బిగెన్ ది బిగైన్ అనే రికార్డును ఏడు పర్యాయములు వేసి, తదుపరి సమాధి మూసివేయమంటూ వీలునామానొకదానిని ప్రకటించారు. అయితే యిప్పుడు వూహించని విధంగా బాబా శరీరత్యాగం జరిగేసరికి, మండలివారంతా అయోమయ స్థితిలో పడిపోయారు.

కొంతసేపు గందరగోళం పడ్డారు. ఏమిచేయుటకు ఎటూ తోచ లేదు.

అయితే అదంతా కొద్దిసేపు భ్రాంతి జనకంగా జరిగింది. అంతలోనే మండలివారు నిబ్బరంతో వ్యవహరించారు. తుది ప్రయత్నాలు ప్రారంభించారు. బాబా శరీరాన్ని మెహెరాబాదు తీసుకువెళ్ళుటకు తగు ఏర్పాట్లు పూర్తిచేశారు. అంబ్యులెన్సునొకదానిని తెప్పించారు. బాబా శరీరాన్ని ఒక స్ట్రెచరుపై పరుండబెట్టారు.

తరువాత యీరుచ్ సోదరి మణిజయిరానీని పిలిచి, స్ట్రెచరుపై వున్న బాబాను ఫోటో తీయమన్నాడట. "బాబాను దూరం చేసుకొన్న విచారంలో వున్న యీ సమయంలో ఫోటో అంటాడేమిటి?" అని సంశయించింది మణి. అయితే యీరుచ్, యిది తర్కానికి సమయం కాదని కాలంవృధా చేయక వెంటనే బాబా ఫోటోలు తీయమని వాటి వలన మునుముందు చాలా అవసరం కలుగునని వుచ్చైస్వరంతో హెచ్చరించగా మణి మారు మాట్లాడకుండా అలాగే బాబా ఫోటోలు తీసింది.

అప్పుడు యీరుచ్ సౌమ్యంగా మణితో అన్నాడట. హఠాత్తుగా జరిగిన యీ సంఘటన మనలను దిగ్భ్రాంతులను చేయుచున్నది. మన మిప్పుడు బాబా శరీరాన్ని సమాధి వద్దకు తీసుకువెళ్ళుచున్నాము. రేపు అసంఖ్యాక బాబా ప్రేమికులు ప్రపంచం నలుమూలలనుండి వచ్చినప్పుడు వారు చూసేందుకు యిక్కడ మిగిలేది యీ ఫోటోలేగదా! బాబా రూపాన్ని యీనాటి ఆయన అంతిమయాత్రా దృశ్యాన్ని ఈ ఫోటోలో చూచుకొని వారు సంతృప్తులవుతారుగదా! ఆమాత్రం నీవు ఆలోచించలేక పోతివిగదా! అని నెమ్మదిగా ఈరుచ్ అన్నప్పుడు తనకావూహ రానందుకు తనను తానే నిందించుకుని మనసులోనే బాబాను క్షమాపణ కోరుకున్నానంటుంది సోదరిమణి.

మెహెర్‌బాబాకు "బిగిన్ ద బిగిన్" అనే పాట అంటే మహా

యిష్టం. ఈ పాటను "పాల్" అనే దైవాన్వేషి ఒకరు వ్రాయగా అమెరికాలో రికార్డు చేయబడినది. అమెరికా ప్రేమికులా పాట రికార్డును స్వయంగా బాబాకు సమర్పించుకున్నారు. బాబా దానిని రోజూ వేయించుకొని విని ఆనందించేవారు. అయితే క్రమేణా అది పాతదై అరిగిపోయింది. అందుచేత ఎలిజబెత్తు పాల్ రసన్ మరో క్రొత్త రికార్డును బాబాకు పంపింది. క్రొత్త రికార్డు చేరగానే మళ్ళీ బాబా దానిని వేయించుకుని విని ఆనందపరవశులై మణిని పిలిచి ఆ రికార్డును జాగ్రత్తగా అందుబాటులో వుండునట్లు భద్రపరచమని చెప్పారట. ఆయన ఎప్పుడు కోరితే అప్పుడు తీసి రికార్డు వేయుటకు దానిని గుర్తుగా ఒక భద్రమైన ప్రదేశంలో దాచివుంచినదట.

యిప్పుడు ఆయన శరీరాన్ని అంబ్యులెన్సులో పెట్టబోవుటకు ముందు ఈరుచ్ మణిని పిలిచి, ఆ రికార్డు తెచ్చి ఏడు పర్యాయములు వేయమన్నాడట.

అందుకు మణి అభ్యంతరం చెప్పినదట. ఈ విషయమంతా మణియే స్వయంగా చెప్పింది. మా బాబా ప్రేమికులు కొందరం విజయవాడ నుండి ఒక పర్యాయం బాబా సమాధి దర్శనంకొరకు మెహెరాబాద్ వెళ్ళి మండలివారిని కలిసినప్పుడు, మణి మెహెరా ఈరూచ్‌లు తమతమ అనుభవాలెన్నో చెప్పారు. వాటిని రెండవభాగంలో మీ ముందుంచుటకు ప్రయత్నిస్తాను

అలా యీరూచ్ ఆ బిగిన్ ది బిగైన్ రికార్డ్ వేయమంటే, మణి కొంచెం బాధపడిందట. అంతా శోకతప్తులైవుంటే, యీ సమయంలో పాట రికార్డ్ వేయమంటాడేమా? అని సంశయించినదట. అన్ని సంవత్సరములు బాబా సమక్షంలో సుశిక్షితులయినప్పటికీ మనోభావాలు ఎంత బలంగా పనిచేయునో గమనించాలి. అయితే యీరూచ్, ఈ విషయంలో కూడా తన మాటను కాదనకుండా వెంటనే నెరవేర్చమనేసరికి మారు

మాట్లాడకుండా ఆ రికార్డ్ తెచ్చి ఏడుపర్యాయములు వేసినదట. అలా వేసింతర్వాత యీరూచ్ ఎప్పుడో బాబా ప్రకటించిన వీలునామా విషయం గుర్తు చేశాడట.

అప్పటికి 2౪ సంవత్సరములక్రితం, అనగా 1945లో బాబా ఒక వీలునామా ప్రకటించారు. అది తన భౌతిక శరీరమునకు సంబంధించినది. ఆయన ఎప్పుడు, ఎక్కడ ఏ దేశములోనైనప్పటికీ తన శరీరత్యాగం జరిగితే దానిని మెహెరాబాద్ కొండపై, మెహెర్ రిట్రీట్‌కు సమీపంలో వున్న సమాధివద్దకు చేర్చి ఆ సమాధిలో వుంచిన తరువాత ఏడు పర్యాయములు బిగిన్ ద బిగైన్ పాట రికార్డ్ వేసి, మూసివేయమని వీలునామాగా ప్రకటన చేసియున్న సంగతి గుర్తుచేసి, అందుకే ఆ రికార్డ్ వేయమంటినని మణితో యీరూచ్ చెప్పగా, యదార్థానికి ఆ పాటంటే బాబాకు ఎంత మక్కువో తెలుసునుగనుక మణి ఆనందించింది.

ముందే బాబా యిచ్చిన ఆదేశంప్రకారం బాబా శరీరాన్ని అంబులెన్సులో ఆరోజే మెహెరాబాద్ కొండపైకి మండలివారు చేర్చారు. మెహెర్‌బాబా పవిత్రసమాధిలో ఆయన శరీరాన్ని వుంచి, సమాధిని తెరిచే వుంచారు. మరి అదేమి ఆశ్చర్యమో బాబా భౌతికకాయం చెడిపోకుండా దాదాపు ఏడురోజులపాటు దివ్యమంగళరూపంతో వెలుగొందుతూ ఆయన కేవలం పరుండివున్నట్లు వున్నది. ఆయన శరీరత్యాగంగురించి ఆకాశవాణిలో ప్రకటించారు. అన్ని ప్రముఖ పత్రికలలోను ప్రకటించారు ఈ వార్త దావానలంలా ప్రపంచ నలుమూలలా క్షణాలలో పాకిపోయింది ప్రేమికులు వందలు, వేలు, లక్షలాదిగా మెహెరాబాదు చేరుకొని, తమ ప్రియతముని కడసారి దర్శనభాగ్యం పొందగలిగారు. తీర్థ ప్రజగా వస్తున్న ప్రేమికుల సమూహాన్ని అదుపుచేయుటకు అవసర ఏర్పాట్లు గావించుట, మండలివారికి పెద్ద సమస్య అయినది.

అంధ్ర ప్రేమికులు ముఖ్యంగా విజయవాడ సెంటరువారు కొంత చొరవతీసుకొని లైటింగ్ ఏర్పాట్లువంటివి చేయగలిగారు. ఎలాగయితేనేమి

బాబా శరీరం ఏవిధమైన మార్పులేక, ఆయన లోగా సూచించినట్లు "నేనీ మారు క్రొత్తతరహాలో పడుకున్నవిధంగా నా దర్శనమిస్తాను" అన్న ప్రకటనను యదార్థత కావించి, అదేమాదిరి అశేష ప్రేమిక సమూహము నకు ఈ ఏడురోజులు బాబా పడుకున్న రీతిలో తన దర్శనభాగ్యం కలి గించారు. బాబా కోరిన ప్రకారం ఏడుపర్యాయములు బిగిన్ ది బిగైన్ రికార్డ్ వేయబడింది. అనంతరం ఫిబ్రవరి 7వ తేదీ 1969 సంవత్స రమున బాబా సమాధిని పదివురు ఆయన ప్రేమికులు, మండలి సభ్యులు అందరి సమక్షంలో అక్కడవున్న అందరూ తలాఒక దోసెడుమట్టిని సమాధిలో పోసి మూసివేశారు.

# బాబా ఔన్నత్యం

యిదీ మెహర్‌బాబాయొక్క సంక్షిప్త జీవిత సంగ్రహం. అయితే ఆయన యొక్క వ్యక్తిగత ఔన్నత్యం గురించి ఆయన మనకందించిన అనుభవాలు తెలిసికోనపోతే అయన అవతార తత్వం మనకు అర్థంకాదు. చూడండి! ఒక పండు వున్నది. దానిని కేవలం బాహ్యంగా చూచి దాని రుచి చెప్పమంటే తిని రుచి చూడకండా ఆ పండు గొప్పదనం చెప్పితే ఎలావుంటుందో అలాగే బాబాను గురించికూడాను. తిని చూస్తేగాని రుచి తెలియదు.

అవతార్ మెహెర్‌బాబా మనమధ్య చాలకాలం జీవించి, ఎన్నో విధములగు అనుభవాలు, సంఘటనలతో నిండిన జీవితం గడిపారు. ఆయన జీవితంలో జరిగిన ప్రతి సంఘటనను అతి జాగ్రత్తగా ఎప్పటి కప్పుడు ఆయన శిష్యులు డైరీల రూపంలో పదిల పరిచారు. ఇప్పటికీ ఆంగ్లంలో ఎందరో పాశ్చాత్య ప్రేమికులు అనేకానేక సంఘటనలను ఎన్నెన్నో పేర్లుపెట్టి పుస్తకాల రూపంలో ప్రచురించారు. అవన్నీ నేటి

ఆయన ప్రేమికులకే కాక భావితరాలవారికి బాబాలోని అత్యున్నత గుణగణాలను అవగాహన చేయుటకు దోహదపడగలవనుటలో సందేహం లేదు.

యిలాంటి ప్రతి గాథవెనుక అసలు రుచి చెడకుండా ఎంతో జాగ్రత్త వహించి, ప్రతి కథా చదువరుల హృదయాలలో హత్తుకుపోయే విధంగా మలచబడ్డవి. వాటిని చదువుతుంటే మనం అందులో లీనమైపోయి వారిని మన కళ్ళముందు సాక్షాత్కరింపచేయుటకు సహాయకారికాగలవు. మరి అవన్నీ అవతార లీలలను మన కళ్ళముందు అద్దంపట్టగలవు. అవన్నీ ఆంగ్లంలో వుండుటచేత తెలుగు ప్రేమికులకు ఆ లోటు తీర్చుటకు యీ సూతనప్రయత్నం చేసి, బాబా లీలామృతాన్ని మీ ముందుంచుతున్నాను.

అవతార్ మెహెర్ అయిదడుగుల అరంగుళాల పొడవున్న అజాను బాహుడు. బంగారు మేలిమిరంగు ఛాయ. స్త్రీ పురుషుల భేదం లేదని చెప్పుటకు నిదర్శనంగా లాగూపై లంగా, చొక్కాతో జడకూడా వేసు కుంటారు. ఆయనపై తీసిన సినిమాలు చూస్తే ఆయన నడక తీరు, కదిలే విధం, హావభావాలు మనలను ముగ్ధులను చేస్తాయి. ఆయన చిరు నవ్వుతో పలకరించే సమయంలో మౌనంతో వున్నప్పటికీ ఆయన ప్రద ర్శించే నమ్రత, ఆప్యాయత, ప్రేమ యివన్నీ గ్రహించగలం. కాలి నడ కన ఆయన రోజుకు 30 మైళ్ళు నడిచేవారు. ఆయన నడుస్తూవుంటే, శిష్యులు ఆయనవెంట పరుగు లంకించుకుంటేగాని ఆయనతో అనుసరించ లేకపోయేవారు.

మరి బాబా రెండు కారు ప్రమాదాలలో తీవ్రమయిన ప్రమాదాలలో చిక్కుకున్నందున శారీరకంగా బలం క్షీణించినట్లుండేవారు. అయితే మనమాయనను ఆలింగనం చేసుకొన్నప్పుడు ఆయన శరీరం చిక్కి శల్య మయి బరువు కోల్పోయినప్పటికీ ఎంతో కాఠిన్యంతో దృఢంగా కనపడేది. ఆయన ఎప్పుడూ భారతీయ సాంప్రదాయంగా భారతీయ దుస్తులే ధరించే

వారు. చూపులకాయన చేతులు, కరకురాళ్ళనుసైతం నుగ్గుచేయగల శక్తివంతంగా కనబడేవి. కానీ అవి ఎంతో మృదువుగా బహు సుకుమారంగా వుండేవి. తన భావాల్ని మనకు తెలుపుటకు ఆయన వ్రేళ్ళను అతి సుకుమారంగా, ఒక వాయిద్యాన్ని వాడు సమయంలో వాయిస్తున్నట్లు వుపయోగించేవారు.

అలా యిచ్చే సౌజ్ఞలు అతి సులభంగా పదముల క్రింద అన్వయించి ఈరూచ్ మున్నగు శిష్యులు నైపుణ్యంగా ప్రకటించేవారు. అయితే రానురాను ఆ చేతి సౌజ్ఞలుకూడా వదలి, కేవలం తన కళ్ళచూపులతో తన భావాల్ని ప్రకటించేవారు. సందర్శనార్థులను ప్రేమతో చేరబిలిచి కన్నులతోనే కుశలములడిగేవారు. చిరునవ్వుతో సాదరంగా తన ప్రేమ భావాల్ని తెలుపుతూ, ఆప్యాయితతో సందర్శకుల హృదయాలలో హత్తుకు పోయేవారు.

ఆయనకు సంబంధించినంతవరకు, ఆయనతో సన్నిహితంగా వున్న స్త్రీమండలి పురుష మండలి సభ్యులు చెప్పిన అనుభవములు కొన్ని తెలుసుకుందాం.

# దైవభక్తి

విధేయత గురించి బాబా ఒకసారి శిష్యులతో ముచ్చటిస్తూ యిలా అన్నారు "భగవంతుని మరువక నిరంతరం ఆయనను జ్ఞప్తిలో వుంచుకొనుటకు విధేయత అవసరం. అయితే అట్టి విధేయతను ప్రదర్శించనీయక ఆ భగవంతుని పూర్తిగా మరచునట్లు చేయు మూడుగుణాలు మనలో పాతుకొనివున్నాయి. కామం, క్రోధం, కాంచనం, అవి వాటిపేర్లు కామాన్ని కాంచనాన్ని, సులభంగా జయించవచ్చునుగానీ. క్రోధాన్ని జయించుట చాలా కష్టం. ఈ మూడింటిని జయించినవాడు సాధుపురుషుడగుచున్నాడు. ఇట్టి వారినే ప్రేమ భక్తులు లేదా దైవభక్తులు అంటారు" అన్నారాయన.

మరి ఈ దైవభక్తుని లక్షణముల గురించి ఆయన వివరిస్తూ, "మండువేసవిలో యెడారిలో ప్రయాణముచేస్తూ దాహమువేసినవాడు మంచి నీళ్ళనే కోరుకుంటాడుకానీ, ముత్యాలో, వజ్రాలో కోరడు. అట్లే దైవ భక్తుడు సంసారదావానల జ్వాలకు భయపడి, ఒక్క భగవంతునే కోరు కుంటాడుగానీ, ప్రాపంచిక భోగాల్ని, కీర్తి ప్రతిష్ఠలను కోరుకోడు" అన్నారు.

ఈ విషయం మనలో పూర్తిగా హత్తుకుపోవుటకు ఒక చక్కటి సంఘటన ద్వారా విశదపడునట్లు ఆయన కల్పించారు. ఇది 1937లో జరిగింది. అప్పట్లో ఆయన తన సన్నిహిత మండలితోబాటు కొందరు పాశ్చాత్యప్రేమికులతో కలసి మెహెరాబాద్ ఆశ్రమంలో తన విశ్వకార్య క్రమం కొనసాగిస్తున్నారు. ఒకరోజున ఆయన శిష్యులందరిని సమావేశ పరచి మెహెరాబాదు ఆశ్రమంలో వున్న ప్రతివారు అవతారునిపై ఒక చక్కని వ్యాసం వ్రాయమని అలా వ్రాసిన వ్యాసములలో అత్యుత్తమమైన వ్యాసానికి చక్కని బహుమతి యివ్వబడునని ప్రకటించారు. మరి అలా వ్రాసిన వ్యాసాన్ని ఫలానారోజున వుదయం 8-00 గంటలకు ఆయన సమక్షంలో ఒక్కొక్కరే చదివి వినిపించాలని కూడా నిర్ణయించారు.

బాబా ఆజ్ఞల మేరకు శిష్యులంతా తలా ఒక వ్యాసం వ్రాసి సిద్ధం చేసి నిర్ణీత తేదీకొరకు ఎదురు చూస్తున్నారు. ఆరోజు రానేవచ్చింది. నియమిత సమయానికి ఆయన హాలులోకి వచ్చారు. ఒక్కొక్కరే తమ తమ వ్యాసాలు చదివి వినిపిస్తున్నారు. ఆయన వింటున్నారు. ఇంతలో డా॥ ఘనీ మున్సిఫ్ వంతు వచ్చింది. డా॥ ఘనీ బాబాకు శిష్యుడేకాక, చిన్ననాటి సహాధ్యాయికూడ.

అయితే ఘనీ నిర్ణీత సమయానికి రాలేదు. రోజూ, మామూలుగా జరిగే కార్యక్రమాలకు బాబా 10, 15 నిమిషాలు ఆలశ్యంగా వస్తూవుండే వారు. అందుచేత ఆరోజుకూడ, డా॥ ఘనీ, బహుశః బాబా ఆలస్యం

గానే వస్తారని ఆశించి, తాను వ్రాసిన వ్యాసాన్ని మళ్ళీ మళ్ళీ చదువుకుని తుది మెరుగులు దిద్దుకుని తాపీగా సమావేశానికి వచ్చాడు. హాలులో ప్రవే శించేసరికి ఎదురుగా, కందగడ్డలా కోపంతో ఎర్రబడి కూర్చున్న బాబాను చూచి ఘనీ ఆశ్చర్యపడ్డాడు. ఆయన ఘనీతో "ఏం? ఆలస్యంగా వచ్చా వేం?" అని సౌంజ్ఞచేశారు.

డా॥ ఘనీ తన సహజధోరణిలో "బాబా! రోజూ నీవు ఆలస్యంగానే వస్తావు కదా అని, ఈవేళ నా వ్యాసానికి తుది మెరుగులు దిద్దుకుని కొంచెం ఆలస్యంగా వచ్చాను" అన్నాడు. అంత బాబా తక్కినవారివేపు చూచి "నేనెంతసేపైంది వచ్చి?" అని ప్రశ్నించారు. ఘనీకంటే మీరు పది నిముషాలు ముందే వచ్చారని అందరూ చెప్పారు. అప్పుడు ఆయన డా॥ ఘనీని దగ్గరకు రమ్మని పిలిచి చాచి దవడమీద కొట్టారు. ఘనీ కిక్కురుమనలేదు. మళ్ళీ ఇంకా దగ్గరకు రమ్మన్నారాయన. అప్పుడు ఘనీ మనసులో "ఈ మాటు బాబా ప్రేమతో ఆలింగనం యిస్తారు. అందుకే దగ్గరకు రమ్మంటున్నారు" అనుకున్నాడు.

అయితే ఘనీ వూహించినట్లుకాక, బాబా మళ్ళీ ఫెడేలుమని రెండవ దవడపై కొట్టారు. కొట్టి వెంటనే అతడు వ్రాసుకువచ్చిన వ్యాసం చదవమన్నారు. చూడండి! విధేయత అంటే ఎలా వుండాలో ఆ విధే యతను అవతారుడు ఎలా పరీక్షిస్తున్నాడో ఈ సంఘటనలో అవగత మవుతుంది. గురుశిష్యుల సంబంధం నిరూపించబడుతున్నది. దైవ భక్తికిది పరీక్ష.

యింత జరిగినా, ఘనీ చలించలేదు. ఏమీ జరుగనట్లే తన సహజ గంభీరశైలిలో, తాను వ్రాసుకొచ్చిన వ్యాసాన్ని అనర్గళంగా చది వాడు. నిజానికి, తక్కినవారు వ్రాసిన వ్యాసాలకంటే, ఘనీ వ్రాసిన వ్యాసం ఎంతో వుత్తమంగా వుంది. రెండు చెంపదెబ్బలు తినికూడా అదంతా మరిచిపోయి అతి సహజంగా ఘనీ తన వ్యాసాన్ని ఎలా చదవ

కలిగాడా?" అని అంతా విస్తుపోయి చూస్తూవుంటే, వారి భావాలను ఆయన గ్రహించారు. తగు జవాబు ఘనీతోనే చెప్పించాలని ఆయన ఘనీతో "యిందాక నిన్ను కొట్టినప్పుడు నీకు కోపం ఎందుకు రాలేదు?" అని అడిగారు.

ఘనీ యిచ్చిన జవాబు తీసుకు అంతా విస్తుపోయారు. ఏం చెప్పాడో తెలుసునా? "బాబా నాకు కోపమైతే వచ్చిందికానీ, నీవు నా చిన్న నాటి మిత్రుడవు కనక నిన్ను క్షమించాను" అన్నాడు. అంతే! బాబాతో సహా అంతా కడుపుబ్బ నవ్వుకున్నారు. మెహెర్ అప్పుడు చెప్పారు. "గురువు ఎదుట ఎలాంటి పరిస్థితులలోనూ మనస్సును తూకం తప్పకుండా వుంచుకొనగల శక్తివున్నవాడే యదార్థ శిష్యుడు అదేయదార్థ దైవభక్తి!" అని చెప్పి అవతారునిపై చక్కని వ్యాసాన్ని అందరికంటె అత్యుత్తమంగా వ్రాసినందుకు ఘనీకి ఆయన చక్కని సూటు బహూకరించారు.

# దైవలీల

అవతారులు, సద్గురువులు. తమ దివ్య మార్గదర్శకత్వాన్ని, తగు రక్షణను యీ జగత్తులో తమను ప్రేమించురీతిలో ప్రేమించకలిగిన మానవాళికి అందిస్తారు. ప్రేమించురీతిలో ప్రేమించుట అంటే మన తెలివి తేటలతో దీని అర్థాన్ని అన్వయించుకోలేము. ఆ ప్రేమ హృదయాంతరాళంనుండి రావాలి. అవతారుడు లేదా సద్గురువు సర్వమానవాళికి యధార్థ రక్షకుడు. యీ విశ్వమంతటిని భరించేది వారి ప్రేమ మరియు కృప మాత్రమే.

అవతారుడు అవతరిస్తాడు. అవతరించుట అంటే అనంత చైతన్యం దైవమానవునిగా మానవరూపంలో అవతరించుట. అవతారుని యీ మానవ శరీరం త్యజించినప్పుడు అనంత చైతన్యం యధావిధిగా పని చేస్తూనే వుంటుంది. దైవమానవుడు అంటే దైవం మానవుడగుటకదా!

అంటే దైవం మాయతెరను తనపై వేసుకుని మానవాళిలో కలసిపోయి, వారిలో తనయందు అద్వితీయమగు ప్రేమ, అనురాగం, ఆరాధన పెరుగునట్లు దోహదపడును.

దైవమానవుడు శరీరత్యాగం చేసినప్పుడు, సృష్టిలోని సకల జీవరాసులయందు, ఆయన అనంత చైతన్యాన్ని యధావిధిగా కొనసాగిస్తూ దైవంగా మిగిలేవుంటాడు. యిందుకు నిదర్శనం ఆర్తులను బ్రోచుటలోనే కాక, మళ్ళీ మళ్ళీ అవతారుడుగా అవతరిస్తూ రుజువు చేస్తున్నాడు.

అయితే సద్గురువు విషయంలో అలాకాదు సద్గురువులు సర్వశక్తివంతులుగా దైవంచే తమకు వప్పగించబడిన శక్తిని తాము సశరీరులైనప్పుడు వినియోగించ గలరు. వారున్న వున్నత భూమికల రీత్యా అట్టి శక్తులు వారిలో సహజంగానే ఉన్నప్పటికీ వాటిని ఉపయోగించుటకు తగు అధికారము కావాలి వారు సశరీరులై వున్నంత వరకు అట్టి శక్తులను వుపయోగించుటకు దైవంచే అధికార మివ్వబడుతుంది. అందుచేతనే సద్గురువు సశరీరంతో వున్నంతకాలం ఈ ప్రపంచంకొరకు ఎంతో మేలు చేస్తాడు. అయితే ఆయన తన శరీరత్యాగానంతరం శాశ్వతానందంలో ఓలలాడుచుండును. కనుక ఆయనలో శక్తివున్నా దానిని వినియోగించు అధికారం వుండదు. సద్గురు సమాధిలో శక్తి వుంటుంది కానీ, ఆ శక్తిని తన భౌతిక లాభంకొరకు వుపయోగించుకొనగలగాలంటే అట్టి భక్తుడు ఆ సద్గురువుకు సర్వార్పణ చేసుకుంటే అనుభవించగలడు.

ఈ కారణం చేతనే కొందరు సమాధి దర్శన భాగ్యంతో, సామాన్యంగా భౌతిక లాభాలు పొందకలుగుచున్నారు. అంతరంగిక లాభం లేక ఆధ్యాత్మిక లాభం పొందాలంటే అది ఆ సద్గురువు సజీవంగా వున్నప్పుడే వీలవుతుంది. అప్పుడా గురువు తలచుకుంటే తనంత వానిగా చేయగల సమర్ధత వుంటుంది. తనలో నిక్షిప్తమైయున్న ఏనలేని సంపదను మనకు ఎరుకపరచి అందిచ్చును. అది ఆయన్న విధి. ఈ విధినే అది

కారాన్ని వినియోగించి యావత్ప్రపంచాన్ని అదుపులో వుంచును.

మరి దైవం శాశ్వతుడు. అట్టి శాశ్వతుడు మానవుడైనప్పుడు రూప రహితుడు రూపం ధరించుట అగుచున్నది. తన అనంతప్రేమను అపార కరుణను సర్వమానవాళికి ఎరుకపరచుటకా భగవంతుడు మానవుడగుచున్నాడు. ఆయన మానవశరీరంతో వున్నప్పటికి, అనంత శక్తి, అనంత జ్ఞానం, అనంత ఆనందం అనే శాశ్వత లక్షణాలు ఆయనను అంటి పెట్టుకొనే వుంటాయి. అవతారుడు సశరీరంతో వున్నా, రూపరహితంగా వున్నా శాశ్వతుడయిన అనంతుడుగానే వుంటాడు. తన అనంత ప్రేమను సర్వమానవాళికి అందిస్తాడు. మరి అటువంటి ప్రేమనే తన ప్రేమికుల నుండి కాంక్షిస్తాడు.

దైవమానవుడు, తన భౌతిక శరీరత్యాగం చేసినప్పుడు భగవంతుడు మానవరూపాన్ని వదిలివేస్తున్నాడు. అనంత ప్రేమ, దయ, కరుణలను యధావిధిగా ప్రసరిస్తూనేవుంటాడు. ఆయనే భగవంతుడు, శాశ్వతుడు కనుక తనకున్న అధికారం, శక్తి వదలిపోవు.

అందుకే అవతారునితో అనుబంధం వున్నవారు సశరీరంతో వున్నప్పుడు అంతర్గత లాభాల్ని ఎలా పొందగలరో, అలాగే ఆయన శరీర త్యాగానంతరం అవతారుని పవిత్రసమాధి దర్శనభాగ్యం పొందినా లాభించును. ఆయన దర్శన, స్పర్శభాగ్యం పొందినవారు ఎంతో అదృష్టవంతులు. అయితే ఆయన శరీరధారుడై మానవాళిమధ్యకు వచ్చినపుడు ఆయనకు సమకాలికులుగా వుండి, ఆయన దర్శనభాగ్యం పొందలేనివారు ఆయనయందు విధేయతాపూర్వక ప్రేమ కలిగివుంటే, ఆయన అవతరణ లాభం వారుకూడా పొందగలరు. యీ పుడమిపై వాతావరణపీడనం వున్నట్లే అవతారుని అవతార పీడనంకూడా ఆయన శరీరత్యాగానంతరం కొంతకాలంవరకూ వుంటుంది.

అవతారుని సాంగత్యం ఎంత బలీయమైనదంటే, హృదయంతో పిలిస్తే ఆయన పలుకుతాడు. ప్రేమతో ఎటువంటి సహాయం కోరినా

ఆదుకుంటాడు. అందుకు తగు విధేయత మనం అలవరచుకోవాలి. ఈ సందర్భంలో మీకు ఒక చక్కని సంఘటన వివరిస్తాము. ఈ యుగంలో మెహెర్ బాబా ప్రేమావతారుడు. ఆశ్రితులనాయన ఆదుకొన్న తీరు ఇది మనకు వివరిస్తుంది.

ఈ సంఘటన 1960లో జరిగింది. ఉత్తరభారతంలో మస్కారా అనే వూరున్నది. ఆ వూళ్ళో బాబూరామ్‌వ్యాస్ అనే బాబా ప్రేమికుడొక రున్నారు. ఉద్యోగరీత్యా ఆయనొక వుపాధ్యాయుడు. జగ్రాణిదేవి ఆయన తల్లి. 56 సంవత్సరాల వయోవృద్ధురాలు. ఆమెకు అవతార్ మెహెర్‌బాబాయందు ఎనలేని విధేయత వుండేది. కుమారుడు వృత్తి ధర్మమాచరిస్తూ విరామ సమయంలో బాబా సేవ చేస్తూవుండేవాడు. పొలం వగైరా వ్యవసాయపనులు తల్లి అజమాయిషీలో జరిగేవి.

పశువులు, మేకలు వీటిని తల్లే సాకుతూవుండేది. 4-5 1960 ఉదయాన జగ్రాణీదేవి పశువులమేతకొరకు పొలంవెళ్ళి పచ్చగడ్డి కోసుకుని నెత్తిపై గడ్డిమోపుతో యింటికి తిరిగి వస్తున్నది. దారిలో అపరిచితవ్యక్తి ఒకడు తారసపడ్డాడు. సుమారు 30 సంవత్సరాల యువకుడు. చేతిలో దుడ్డుకర్రతో ఆమెను అటకాయించాడు. దురుసుగా ప్రవర్తించి "నేనెవరో తెలుసా?" అన్నాడు.

"లేదు నాయనా! నీవెవరివో ఎరుగను" అన్నది. దానితో అతడు ముందుకువంగి, ఆమెను మొరటుగా వెనుకకు పడదోశాడు. నెత్తిమీద బరువుతో వెల్లకిలా పడి ఆమె పళ్ళురెండు కదలిపోయాయి. ఏడుస్తూ లేచి కూర్చుంది. అతడు అతి దుర్మార్గంగా ఎదుర్కొన్నందుకు ఆమె దూషించసాగింది. దానితో అతడు రెచ్చిపోయి ఆమెవద్దవున్న వెండి, బంగారు నగలన్నీ వలిచియిచ్చివేయమని దౌర్జన్యం చేశాడు.

చచ్చినా పీసమెత్తు బంగారం కాదుకదా, వెండికూడా యివ్వనని హెచ్చరించింది.

అందుకాతడు మరీ వుగ్రుడై, ఆమె రెండుకాళ్ళు పట్టుకొని బరబరా యీడ్చుకొంటూ చెంతనేవున్న ఏటివాలుకు లాక్కుపోయాడు. జగ్రాణి రానున్న అపదను పసికట్టి ఆర్తత్రాణపరాయణుడయిన మెహెర్‌బాబాను తలుచుకుంది. "బాబా! ప్రియతమ బాబా! మెహెర్‌బాబా! నన్ను రక్షించు నీవే తప్ప మరి ఎవరూ నన్ను రక్షించువారు లేరు. నా ప్రేమ నిర్మల మైనదయితే, నీవేగనుక భగవదవతారమైతే వెంటనే వచ్చి నన్ను ఆదుకో" అంటూ ప్రార్థించింది.

ఆమె ప్రార్థనవిన్న ఆ క్రూరుడు వికటాట్టహాసం చేస్తూ "ఎందుకు వృథాగా ఏడుస్తావు? యిక్కడ బాబా ఎవరూ లేరు. యిప్పుడు నిన్ను రక్షించేవాడెవడూ యిక్కడ లేడు. నిన్నిక్కడే వధించి, నీపై వున్న ఆభరణాలన్నీ వలుచుకుని, నిన్నాఏట్లో పారేసిపోతే ఎవరికీ తెలియదు. అనవసరంగా ఎందుకు ఛస్తావు? మర్యాదగా నగలన్నీ యిచ్చేయి" అన్నాడు.

అంటూనే ఆమెను ఏటిఒడ్డుకు లాక్కుపోయాడు. దారిపొడుగునా ఆమె తన హృదయాంతరాళంనుండి, శరీరంలోని ప్రతి అణువునుండి, బాబాను స్మరిస్తున్నది. ఏటిఒడ్డుకు పోగానే చేతికర్రను ఆమె తలపై మోదుటకు పైకెత్తాడు. ఆ మరుక్షణంలోనే ఎక్కడనుండి వచ్చాయో మూడావులు అమాంతం పరుగునవచ్చి, కర్ర ఎత్తిన ఆ దుర్మార్గుడిని ఎదుర్కొన్నవి. ఆవులు రంగప్రవేశంచేయగానే, ఆ దుర్మార్గుడు ఎత్తిన కర్ర గురితప్పింది. జగ్రాణి దెబ్బ తప్పించుకుంది. వాటిలో ఒకటి ఎర్రది. రెండు తెల్లవి. ఎఱ్ఱావు అతడిని తన వాడికొమ్ములతో కుమ్మి నేలపై ఎత్తి గిరవాటువేసింది.

క్రిందపడిన ఆ దుర్మార్గుడు తనను తాను రక్షించుకొనుటకై తన కర్రతో అవును ఎదుర్కొన్నాడు. అది అదనుగా తీసుకొని జగ్రాణి తప్పించుకొని పారిపోవుటకు ప్రయత్నించింది. అయితే ఆవుతో పోరాడు

తూనే ఆమె పలాయనాన్ని పసిగట్టిన ఆతడు ఆమెను ఒకచేత్తో పట్టుకొని, ఏటిఒడ్డుకు లాగజొచ్చాడు. ఎద్దావు అతడిని వదలక కుమ్మట సాగించింది. వేడి వుచ్ఛ్వాస నిశ్వాసలతో బుసలుకొడుతున్నది. అతడుకూడా అతిక్రూరంగా దానిని ఎదుర్కొంటున్నాడు. కర్రదెబ్బలకు ఆవు పేట్రేగి పోయి భయంకరంగా అతడిని కుమ్ముతున్నది. తక్కిన రెండావులూ జగ్రాణికి రక్షణగా నిలబడ్డాయా అన్నట్లు ఆమెనుచేరి ఒక ప్రక్క రక్షక భటులవలె నిలబడ్డవి.

జగ్రాణిమాత్రం యిదేమీ పట్టించుకోలేదు. ఆమె కేవలం బాబా నామం మాత్రమే జపిస్తూంది, ఆమెకు అయోమయంలో ఏమీ పాలు పోలేదు. అంతలో దూరంగా ఏదో ఎడ్లబండి వస్తున్నట్లు గంటలసవ్వడి వినపడింది. పరిస్థితి విషమిస్తున్నట్లు పసిగట్టిన ఆ క్రూరుడు ప్రమాదం గుర్తించి పలాయనం చిత్తగించాడు. సరియగు సమయానికి సహాయం అందివ్వబడింది వచ్చే ఎడ్లబండి ఆ వూళ్ళోవాళ్ళదే. జగ్రాణిని వారి బండిపై యింటికి తీసుకువెళ్ళారు. మూడావులు వారి బండిననుసరించి కొంతదూరంవరకూ వెళ్ళినవి. మర్నాడు ఆ వూరి గ్రామస్థులు, యీ దుర్మార్గుని వెతుకుతూ వెళ్ళి ఏట్లో అతని పాదగుర్తులు గమనించి, వాటి ద్వారా అతడున్న చోటును గుర్తించారు. చివరకతనిని పట్టుకుని పోలీసులకు ఒప్పగించారు. చూచారా! బాబా హృదయంతో పిలిస్తే పలుకుతానంటారు. యిది మహత్తెందుకవుతుంది?

బాబా యిలా చెప్పేవారు. యిలాంటి మహత్తులు తనకు అంటగంటవద్దనేవారు. యీ సంఘటన గురించి బాబావద్ద ముచ్చటించగా "భగవంతుడు సర్వాంతర్యామి. ఎవరయితే ఆయనను హృదయపూర్వకంగా పిలుస్తారో వారికి ఆయననుండి తగు సహాయము పొందుటలో ఎన్నడూ అపజయం పొందరు. అట్టి ఆర్తిని వినకుండుట ఎన్నటికీ జరుగదు" అన్నారు.

# మహాత్తు

"ఈ జీవితముయొక్క లక్ష్యము భగవంతుని ప్రేమించుట. జీవితం యొక్క గమ్యం, భగవంతునిలో ఐక్యమగుట. యిది ఆచరించుటకు నీవీ జగత్తును త్యజించనక్కరలేదు. అల్పకోరికలు, అవిధేయత, నటన వంటివి వదలిన చాలును. అప్పుడు నీవు నీ నిజజీవితంలో ధర్మాలనాచరిస్తూ ఆయనను ప్రేమించురీతిలో ప్రేమించగలవు" అన్నారు బాబా.

అయితే బాబా యీ సందర్భంలో మరోవిషయం చెప్పారు. "లక్ష్యము గమ్యములగురించి మాట్లాడుట అంధుని చేతిలో లాంతరు వంటిది. అంధునికి అవసరమయినది చేతికర్రకాని, లాంతరుకాదు. అలాగే అన్వేషకునిచేయి, దైవమానవునిచేతిలో వుండాలి" అన్నారు.

"ప్రేమ మిమ్ములను నా చెంతకు చేర్చినప్పుడు, దేనికొరకూ మీరు నన్నర్థించవద్దు. మీరు నా సమక్షంలో వున్నప్పుడు మౌనంతోవుండండి. మీరేదయినా అడిగినచో, మీరేదో పోగొట్టుకున్నట్లే! ప్రేమలో ప్రశ్నలకు చోటులేదు. అందుచేత జవాబు కోరదు. మీరు నన్నెంతగా ప్రేమిస్తే అంత తక్కువ అడుగగలరు. నా సమక్షానికి వచ్చిన్నప్పుడు మీరు నేను చెప్పేది వినాలిగాని, నన్ను ప్రశ్నలు వేయరాదు. తెలివితేటలతో ఆధ్యాత్మిక ప్రశ్నలెన్నో వేయవచ్చును. అన్నిటికీ జవాబులు చెప్పవచ్చును. అయితే అట్టి ప్రశ్నలు, జవాబులు ఆధ్యాత్మికోన్నతికి సహాయకారి కావు. మేధస్సుతో వేసే ప్రశ్నలు విన్న ఆలోచనల కూపంనుండి వెలుపలకు తేలేవు. నేను చెప్పేది విని అర్థంచేసుకొనుటకు ప్రయత్నించండి"

"మీరు మీ ప్రియతమునిపై కోర్కెలతో వత్తిడిచేస్తే అది ప్రేమను అగౌరవపరచినట్లు కాగలదు. ప్రేమ యిచ్చునేకాని ఎన్నడూ దేనిని కోరదు. ప్రియతముని యిచ్ఛ పరిసరించువరకూ, అట్టి ప్రేమ అవిచ్ఛిన్నంగా కొనసాగుతుంది. నా యిచ్ఛ ఎట్టి ఎరుకలేకుండానే పరిపరించ

బడుతుంది" అన్నారు బాబా.

దైవకృప యీ దృశ్యప్రపంచానికి అతీతమైనది. అది ఆత్మ పొందే ఆధ్యాత్మిక పరిపూర్ణత్వంపై ఆధారపడివుంటుంది. భగవంతుడు మన తప్పులను క్షమిస్తాడు. మనకు తెలియకుండా మనలో రేగే కోరికలు ప్రేమపూరితములయినప్పుడు అవి అయనలో విగూఢమైయున్న కృపను మేల్కొల్పును. అట్టి కృపమాత్రమే అభేద్యమగు నిర్దాక్షిణ్య కర్మ సిద్ధాంతమునుండి కొత్తపుంతనందించును. అలౌకిక సంఘటనలతో యీ కృపకు సంబంధంలేదు. యిట్టి కృప ఆత్మయొక్క అనుచితమగు, బానిస శృంఖలములనుండి విముక్తిచేయుటలోనే సంబంధం కలిగియుండును.

బాబా మహత్తులు చేయుటకు యిష్టపడేవారు కాదు. మహత్తులు ఆధ్యాత్మికాభివృద్ధికి దోహదం చేయవనేవారు. "ఈ జీవితమే ఒక బ్రహ్మాండమయిన మహత్తు. జీవంతో పునర్జన్మ పొందుట మహత్తులో కెల్లా మహత్తు" అన్నారు బాబా.

"బాగా గుర్తుంచుకొనుడు. నేనేమీ మహత్తులు చేయనప్పటికీ ఎవరయినాసరే తమ హృదయాంతరాళములనుండి ఏమి అడిగినప్పటికీ అది యిచ్చెదను. నేను బాబానే అయితే ఏమయినా చేయగలను. మీరు హృదయంతో అడగండి. మీరు తప్పక పొందగలరు" అని చెప్పారు బాబా.

అలా బాబా చేసిన మహత్తుకు సంబంధించిన ఒక సంఘటన చదవండి. అది కరాచీపట్టణంలో జరిగింది. కరాచీలో ఒక ఆచారవంతమైన పార్శీకుటుంబముండేది. ఆ కుటుంబమంతా జోరాష్ట్రియన్ మతస్థులు. అయితే వారికో కూతురున్నది పేరు రోడా. ఆమె అవతార్ మెహెర్‌బాబా గురించి ఇరుగుపొరుగువారిద్వారా విన్నది. అయిత్తే ఆమె కుటుంబానికి బాబాఅంటే విశ్వాసంలేదు, అయననొక మోసగానిగా చూసేవారు. ఎందుకంటే, వాళ్ళ యింటిప్రక్కన ఒక బాబా ప్రేమికురాలు

వుండేది. ఆమె బాబాను ఎంతగానో ఆరాధించేది. అయితే ఆమె ఆకస్మాత్తుగా విచిత్ర వ్యాధికిలోనై, అమిత బాధపడి మరణించింది స్థానిక జొరాష్ట్రియన్‌లంతా. తమ ప్రభువుని విస్మరించి, బాబాను అనుసరించినందుకు ఫలితంగా ఈమెకు తమ దైవంయిచ్చిన శిక్షే యీ మరణం అని తేల్చిపారేశారు.

రోడా పెరిగి పెద్దదయినది. ఆమెకు ఆదిదుబాష్ అనే అతడితో వివాహం స్థిరమైంది. అతనికి బాబాతో సంబంధంవున్నదో లేదోరోడాకు తెలియదు. ఒకరోజు సాయంత్రం బాబా శిష్యుడు మినూకరాస్ ఆదిదుబాష్‌తో బాబా గురించి చర్చిస్తుంటే రోడా విన్నది. మినూకరాస్ బాబా కొలువులో రాయలాస్థానంలో రామలింగని వంటివాడు. ఆమె మనస్సు సంక్షోభంలో పడ్డది. తన కుటుంబానికి బాబా అంటే గిట్టదు. ఆమెకు ఆదిదుబాష్‌పై మనసున్నది. అయితే అతడు బాబా ప్రేమికుడు. అందుకు ఆమె తలితండ్రులు అంగీకరించరు. సమస్యతీరేదెలా?

ఆదీనే అడిగిందొకరోజు "మీకు బాబామీద పూర్తినమ్మకమున్నదా? మినూకరాస్ చెప్పినట్లు మీకు బాబామీద విశ్వాసమున్నదా?" అని అడిగింది. "ఏం? ఎందుకు విశ్వాసములేదు? నాకు ఆయన ఎడల పూర్ణ విధేయత, విశ్వాసం వున్నది" అన్నాడు ఆదీ. "ఈ సంగతి మీరు నాకు ముందే చెప్పివుండాల్సింది? యిప్పుడెలాగా?" అనుకుంటూ ఆలోచనలో పడ్డది రోడా. మళ్ళీ ఆదీదుబాష్‌దగ్గర ఈ ప్రశ్న తేలేదు.

రోడాకు యిప్పుడేమి చేయాలో పాలుపోలేదు. ఆమె ఆదీని అమితంగా ప్రేమిస్తున్నది. అతడిని వివాహమాడాలని వున్నది. అయినప్పటికి బాబాయందున్న ప్రేమ తమ కుటుంబగౌరవానికే భంగంగా తలుస్తున్నది. ఈ విషయంలో ఆమె ఎంతో మదనపడింది. తుదకు ఏమైనాసరే వివాహమాడ నిశ్చయించింది. యిది తనకు, ఆదీకి పరీక్షాసమయమనుకున్నది. ఫలితం భగవంతునిపై వుంచింది.

ఆమె ఒకరోజు ఏదో ఆలోచిస్తూ కూర్చుంటే తన చిన్నప్పటి కోరికొకటి గుర్తొచ్చింది. భగవంతుడు తమ వివాహాన్ని వర్షంతో ఆశీర్వదించాలనేది ఆ కోరిక. కరాచీ ఎండలెక్కువుగా వుండే ప్రదేశం. సంవత్సరమంతాకూడ వానలుండవు. ఒకవేళ వానంటూవస్తే, కొద్దిగా జల్లుపడి క్షణాల్లో ఎండిపోతుంది. అందుచేత, వానరాకడ, దైవంయొక్క ప్రత్యక్షానికి ఆశీర్వచనానికి శుభసూచకమనుకున్నది. ఈ విషయం జ్ఞాపకానికొచ్చేసరికి ఆమెకు బాబాను సవాలు చేయాలనే తలంపు ద్యోతకమైంది మనస్సులోనే సవాలుచేసింది. ఏమని? "ఆదీ తలుస్తున్నట్లు మెహెర్ నిజంగా భగవంతుడే అయితే తన వివాహ సందర్భంగా వర్షం కురిపించి రుజువు చేయాలి" అని సవాలు చేసింది. అయితే ఆమె ఆ తరువాత తన సవాలును గుర్తుంచుకోలేదు. కొద్దిరోజులలోనే మరచిపోయింది.

కొన్నాళ్ళు గడిచినవి. వివాహ శుభదినం రానేవచ్చింది. ఆ రోజు ఎండ ఎక్కువగానే వున్నది. ఆకాశం రోజూలానే ప్రశాంతంగా వుంది. ఆ సంతోష గడియలలో రోడాకు తన సవాలు గుర్తులేదు. సాయంత్రం వివాహ వేడుకకు అంతా సిద్ధమైనది. వేదికను కడుశోభాయమానంగా అలంకరించారు. హఠాత్తుగా ఆకాశం మేఘావృతమైంది. కారుచీకట్లు కమ్ముకొచ్చాయి. కుంభవృష్టి కురవసాగింది. కరాచీ చరిత్రలోనే అంతటి వర్షం అరుదు. జనమంతా తడిసిపోయారు. బజార్లన్నీ వర్షపునీటితో నిండిపోయి, కార్లు ఎక్కడివక్కడ ఆగిపోయాయి. వివాహ క్రతువు జరుపవలసిన పురోహితుడుకూడా వానలో యిల్లువదలిరానన్నాడు. అయితే అతడిని బ్రతిమాలి దేవాలయానికి తీసుకువెళ్ళారు. అందంగా అలంకరించిన తోరణాలు వగైరా పాడైపోయాయి. ఎందరినో ఆహ్వానిస్తే చాల కొద్దిమందిమాత్రమే వివాహానికి వచ్చారు.

ఆదీదుబాష్, రోడా లిరువురికీ తడిసిన బట్టలతోనే వివాహ క్రతువు పూర్తిచేశారు. క్రమంగా ఆదీదుబాష్‌కు బాబాయందున్న ప్రేమవలన

రోడాకూడా మెహెర్ పరిధిలోకివచ్చింది. ఎంతో ప్రేమతో బాబా పాద సన్నిధిని చేరి అయన ప్రేమకు పాత్రురాలయింది.

రోడా బాబాతో ఎన్నో సంవత్సరముల అనుబంధం పెరిగింది. ఆయనకు తమ వివాహంరోజు గురించి ఇంకా గుర్తున్నదా అని ఎప్పుడూ అనుకొనేది. కానీ, అయననెప్పుడూ అడుగలేదు. అయనేకూడా ఆమె సవాలును తనకు గుర్తున్నదని చెప్పలేదు.

1964లో సరోష్ యిర్వానీగారి కుమారుడి పెళ్ళి అహ్మద్‌నగర్‌లో జరుగుతున్నది. పెళ్ళికి ముందురోజున సరోష్ కుటుంబాన్నంతటినీ, మెహెరాబాద్ రమ్మనమని పిలిచారు. పెళ్ళికి తన ఆశీర్వచనం అందించారు. మర్నాడే పెళ్ళి. ఆ రోజు పెళ్ళి అయ్యేంతవరకూ కుండపోతగా వర్షం కురిసింది. ఆ తరువాత ఒకరోజున సరోష్ మెహెర్‌వద్దకు వెళ్ళినప్పుడు "మెహెర్! వర్షం కురిస్తే అది నీ ఆశీర్వచనమా?" అని అడిగాడు. "దానిని గురించి రోడానడుగుము" అన్నారాయన. అప్పుడు తెలిసింది రోడాకి తన సవాలును ఆయన స్వీకరించి తన అవతార తత్వాన్ని రుజువు చేసుకున్నారని తెలుసుకోగలిగింది.

రోడా, ఆదిల వివాహమైనతర్వాత రెండేళ్ళకి రోడా గర్భవతి అయింది. నెలలు నిండిన తరువాత డాక్టర్లు పరీక్షించి కాన్పు కష్టమవుతుంది, బిడ్డ మరణించును అని చెప్పారు. అయితే రోడా అలా జరుగుటకు వీలులేదని తనకు తప్పక బిడ్డ సజీవంగా పుట్టాలని, అలా చేయమని మెహెర్‌ను ప్రార్థించింది. మళ్ళి ఓ శపథం చేసింది. తనకు బిడ్డ సజీవుడై పుడితే ఆ బిడ్డను మీకు సమర్పించుకుంటానన్నది రోడాకు నెలలు నిండి చక్కని పిల్లవాడు పుట్టాడు. ఆమెకిప్పుడు మెహెర్ పేరు గుర్తుండుటే కాదు, ఆపాదమస్తకమాయన పేరు ప్రకంపిస్తున్నది. తరువాత మెహెర్ ఆ పిల్లవానికి "మేర్వాన్" అని పేరు పెట్టమని కబురు పంపారు.

ఆ పిల్లవానికి ఏడ్వర్ధంగడిచిన తరువాత మెహెర్ తనకు వప్పగించ మని కబురుపెట్టారు. ముందుగా మేర్వాన్‌ని అతడి తలిదండ్రులు ఆదిి. కె. ఇరానీగారి ఆఫీసుకు తీసుకువచ్చారు. ఆదిజీ స్వయంగా మెహెర్ ఒడిలో మేర్వాన్‌ని వుంచాడు. ఆ తరువాత తలిదండ్రుల్ని ఆయన గది లోకి అనుమతించారు. నేలపై ప్రాకుతూ మేర్వాన్ బాబా పేరు స్పష్టంగా వుచ్చరించాడు. ఆ తరువాత లండన్‌లో వున్నత విద్యాభ్యాసంచేసిన మేర్వాన్ పూర్తిగా ఆయనకు సమర్పింపబడ్డాడు.

మొదటి భాగం

సమాప్తం



# ముఖ్యమైన తప్పులకు ఒప్పులు

| పేజి | పేరా | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 11 | 3 | సద్గుగువు | సద్గురువులు |
| ,, | ,, | పుడిమి | పుడమి |
| 15 | 4 | సంపాదించుచు | సంపాదించును |
| 16 | 1 | ప్రమాణాం | ప్రయాణం |
| 22 | 3 | క్రిదం | క్రింద |
| ,, | 6 | అనందానందానుభూతి | అమందానందానుభూతి |
| 25 | 2 | రోంపడి | జోంపడి |
| 29 | 2 | మెహెర్ | మెహెరా |
| 32 | 1 | తానెబదుకు | తానెందుకు |
| 33 | 3 | ప్రచురించుట | ప్రసరించుట |
| 34 | 3 | 1979 | 1969 |
| 42 | 1 | డోకల | డోలక్ |
| 43 | 1 | మూలమై | మూలమే |
| 53 | 4 | నావార | నీవార |
| 57 | 2 | మానవాస్థానము | మానవావస్థానము |
| 59 | 2 | సర్వార్చణ | సర్వార్పణ |
| 60 | 3 | సభ్యునిగా | సఖునిగా |
| ,, | ,, | అంతంగం | అంతరంగం |
| 70 | 3 | సందర్శించేశారు | సందర్శించేవారు |
| 79 | 1&2 | ప్రమాణం | ప్రయాణం |
| 82 | 2 | చైతన్య | చైతన్యం |
| 82 | 5 | అనంతర | అనంత |
| 86 | 1 | పాల్రపన్ | పాటర్సన్ |

106

I am grateful
I am indebted
To these
Who have rendered
This task possible

Sister Mehera Irani
Sister Maniza. S. Irani
Brother Eruch Jassawala
Brother Don. E. stevens
Brother William Lepage
Brother William Donkin
Brother C. B, Purdom
Dr. H. P. Barucha
Sister I. O. Duce
Sister Jean Adrial
Sister Elizabeth Patterson
Sri Tadepalli Basavaiah
Sri Immadi Madhu Sudana Rao

| Check List | | | |
|---|---|---|---|
| Book Number | GV-P01M193 | Date | 9/02/21 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CP, 107. | | |
| Missing Pages | NO | | |
| Prepared | Kaushmi | Scanned | Swathi |
| BOOK SIZE | H 73 W 4.8 | Pages | 111 |